
LIFEBUOY
for health
లైఫ్‌బాయ్
ఎక్కడో
ఆరోగ్యం అక్కడ
లైఫ్‌బాయ్‌తో స్నానం చేస్తే పరిశుభ్రంగా ఉంటారు మీరు. ఆరోగ్యమైన తాజాదనపు అనుభూతి పొందుతారు. లైఫ్‌బాయ్‌తో, జీవితం ఆరోగ్యప్రదం. గుర్తుంచుకోండి...
లైఫ్‌బాయ్
మురికిలో గల క్రిములను
కడిగి వేస్తుంది

సంస్థాపకులు
వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 21 జూన్ '83 సంచిక 5

# ఇదీ వరుస...



ఈనెల నవలానుబంధం

జ్యోతి-భాగ్యలక్ష్మి నవలల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన నవల

## ఈ దేశం ఒక హిమాలయం

రచన

తురగా జానకిరాణి

జ్యోతి పి.బి. నెం. 1824, హైదరాబాదు - 20

రాధిక ముఖచిత్రం

ప్రతి మగువా మనసుపడుతుంది
ప్రతి చూపూ వెంటబడుతుంది
రాజ్‌కమల్ చీరల రహస్యం అది

*R. Jaya Prada*

రాజ్‌కమల్

కాటన్ ప్రింటెడ్ చీరలు







Manufacturers
SHREE SITARAM DYIENG & PRINTING
MILLS PVT. LTD., BOMBAY-2

మీ ప్రియమైన సినితార "జయప్రద" రాజ్‌కమల్ "మార్వలెస్ జాకెట్

# ఉత్తరాలు

"మే" నెలలో జ్యోతి మినీ కథల కన్సొలేషన్ బహుమతి పొందిన కథ "మనిషి" మమల్ని ఎంతో ఆకట్టుకుంది యర్రంశెట్టి శాయిగారి సెన్సార్ కత్తెర జిందాబాద్ నిజంగా "మే" నెల జ్యోతి హైలైట్, "డబ్బు టుది పవర్ ఆఫ్ డబ్బు" పుణ్యమాని జ్యోతి పాఠకుడిని అయిపోయాను. ఈ సీరియల్ అయి పోయినా ఇంకా జ్యోతి పాఠకుడిగానే మిగిలిపోయాను "బాపు"గారి జోకులు మా హృదయాన్ని ఊపేసింది. మా గుండెల్ని తీసుకెళ్ళి హాస్య సముద్రము లోముంచి....ముంచి...ముంచివేసింది. ఇంత నవరస గుళికలు లాంటి బాపు గారి జోకులు వేస్తున్న మీకు నాహార్ధికా భివందనాలు.

పెదిరెడ్డి సురేష్
(ధవళేశ్వరం)

o o o o

"గుండె నిండిన వేళ" యామిని సరస్వతిగారి కథ హృదయాన్ని కదిలిం చింది. నిజంగా ఆ కథ నిజమైనట్లయితే నా జోహార్లు తెలుపుతున్నాను. వి, మోహన్ కుమార్ గారి "శస్త్రవిన్యాసం అస్త్రసన్యాశం" నవీన నవల నాకు మార్పు అనేది ఏ ఒక్క వ్యక్తిలోనో, ఏ నలుగురిలోనూ, కాదు, సమాజంలో ఉన్న అన్ని రంగాల్లో, అందరి వ్యక్తుల్లో మార్పు రావాలని ఆకాంక్షించే నవల, వారికి నా హృదయపూర్వక అభినందనలు. ముఖచిత్రం కొత్తపుంత తొక్కింది బాగుంది. ప్రతి సంచికలో ఒక "కవిత" కూడా ముద్రిస్తే బాగుంటుందేమో,

చెట్లపల్లి జ్ఞానేశ్వర్
(సిద్ధిపేట)

o o o

నిన్నటి జ్యోతి మాస పత్రికలో హైలెట్ యండమూరి సృష్టి డబ్బు! డబ్బు! డబ్బు! నేటినుండి జ్యోతిలో హైలెట్ అల్లాదేవి "కల్లోల గౌతమి" ప్రారంభంలోనే మనసు ఆకట్టుకుంది అని చెప్పడంలో సందేహం లేదు, ముందు ముందు ఇంకా ఆసక్తిగా సాగిపోతుందని ఆశిస్తున్నాను. అదే విధంగా యామిని సరస్వతిగారి "గుండె నిండిన వేళ" కథ బాగుంది.

చండీప్రియ
(విశాఖపట్నం.)




500 గ్రా.,
250 గ్రా.,
100 గ్రా.లలో
దొరుకుతుంది.

**చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం**
**రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం**

చిక్కదనపు పరీక్షలో లిప్టన్ టాప్‌స్టార్‌దే గెలుపు. చూడగానే తెలుస్తుంది దానిలోని ప్రత్యేకత. తాగగానే తెలుస్తుంది దానిలోని ఘాటైన రుచి.




# లిప్టన్
# టాప్ స్టార్
# టీ

**చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్**

LIPTON

# డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు

డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు! 'జ్యోతి' లో ధారావాహికంగా ప్రచురించ బడుతూ, "అయిపోయింది" అని వారు అనకముందే నవభారత్ వారు పుస్తక రూపంలో తెచ్చారు సీరియల్ నవలను. పుస్తక రూపంలో వచ్చినప్పటినుంచి పావలా లైబ్రరీలలో గిరాకీ గానే ఉంది కాబట్టి. "జ్యోతి" పాఠకులు నవల ముగింపును "జ్యోతి" లోనే మొదటిసారిగా చదివి ఉంటారనుకోండి. అది వేరే విషయం.

కథానాయకుడు "గాంధి" పదిపైసలతో యాభై లక్షలు ఎట్లా సంపాదించాడన్నది, నవల చదివి తెలుసుకుంటేనే బాగుంటుంది. ఇన్ని లక్షలను గాంధీ "చట్ట బద్ధంగా" సంపాదిస్తాడు. అట్లా సంపాదిస్తాననేదే అతని పందెం. అయితే ఆ చట్టంలోని లొసుగులను అతను ఉపయోగించుకుంటాడు. అంతే తప్ప దోపిడి చేయడు.

ఇదంతా వాస్తవానికి ఒక అద్భుతమైన మేధావిలసనం. యండమూరి ఊహా సంపద ఏ యాభై లక్షలోకాదు, ఎన్నికోట్ల విలువైనదో అన్న ఆశ్చర్యం మనకి నవల చదువుతున్నంతసేపూ కలుగుతూనే ఉంటుంది. ఈ నవలలో చిత్రించబడిన రాజకీయ ఆర్థిక రంగాల కలగలుపు భీభత్సం మనకు "ది రూయిడ్ సిటీ", "ది ఆర్-డాక్యుమెంటు" లాంటి ఇంగ్లీషు నవలలను గుర్తుకు చేస్తూ ఉంటుంది. అంతవరకే పోలిక. ఆ నవలలకిది అనుసరణ కాదు; మరొకటికాదు. యండమూరి వీరేంద్రనాధ్ ప్రతిభావంతుడైన రచయిత. అతని ప్రతిభ పరిపూర్ణంగా ప్రదర్శితమయ్యే నవల-డబ్బు టు ది ఆఫ్ డబ్బు. "తులసి" ఆయనను ఖ్యాతిలోకి తీసుకొని వచ్చి ఉండవచ్చు. కాని యింతవరకు వచ్చిన వాటిలో ఆయన మేగ్నమ్ ఓపస్ ఏదంటే, ఈ నవలేనని చెప్పవచ్చు.

గురువుగారి శిష్యుడులాగా వారికి లక్ష్మి గాంధీల వివాహం జరిగిందా లేదా అన్నదే థ్రిల్ కలగించే అంశం కావచ్చు కాని ఆలోచనాపరులకు ఏడు కావ్వాత్తుల స్టాండు దగ్గరే నవల అద్భుతమైన ముగింపుకు వచ్చేస్తుంది.

ఇదిగో, వీడే మా బుజ్జాయి...
ఆట-పాటల్లో వీడికి లేదు సాటి
అలాగే వీడి బట్టల తెలుపుకూ లేదు సాటి




కేవలం నీలి స్వస్తిక్
డిటర్జెంట్ బార్‌తో లభించే
స్వచ్ఛత మరియు
తెలుపు అన్నిటికంటే ఉత్తమం.
మరియు వెలకూడా
ఎంతో తక్కువ.

**నీలి 卐 స్వస్తిక్**
**డిటర్జెంట్ ఉతికే బార్**

ఒక మారు స్వస్తిక్ బార్...
మరి మరి స్వస్తిక్ బార్

Shilpi DM 3A/83 Tel.

అసలంతకీ లక్ష్మి గాంధీల వివాహం జరిగిందా? లేదా? "గాంధీ" అన్న
పిలుపువిని, గాంధీ వెనుదిరిగిన ఆ ఒక్క క్షణం లక్ష్మికి చాలునంటారు-
రి. ఆ ఒక్క క్షణంలో లక్ష్మి బొమ్మ పడితే బొరుసు చేసిందా
తే బొమ్మ చేసిందా? పాఠకులు జుట్టు పీక్కోవలసిందే తప్ప ఈ
ధానం దొరకదు. ఇట్లాంటి ముగింపు తెలుగు నవలా సాహి
కూడా కన్పించదు. ఇంగ్లీషులో షడ్‌హౌస్ రచనల్లో మాత్రం

విప్లవం రావాలి-వ్యవస్థ మారాలి- అని గొంతు చించుకునే నిరుద్యోగులు ఒక్కరైనా తన నవల చదివి ప్రభావితులు కావాలనే ఆకాంక్షను యండమూరి తన గాంధీ పాత్ర, ద్వారా ప్రకటిస్తాడు. ఒక్కరు కాదు; వేలాదిమంది అట్టా ప్రభావితులు కావాలి. అంటే అర్థం-'చట్టబద్ధంగా, కాని న్యాయ విరుద్ధంగా' లక్షలు సంపాదించే మార్గదర్శనం పొందడం కోసం కాదు. చట్ట బద్ధంగా జరిగే దోపిడిని విప్లవాలు నిరోధించలేవని తెలుసుకోడానికి. విప్లవాల తర్వాత మళ్ళీ చట్టాలు వస్తాయి క్రొత్త చట్టాల పరిధిలో క్రొత్త రకపు దోపిడీ మార్గాలు కనుగొనబడతవి. చట్టాలు, ప్రభుత్వాలు మారటం వల్ల దోపిడీ ఆగదు. మనిషి మారాలి. గాంధీలాగా డబ్బుకు మించిన విలువలున్నాయని గుర్తించాలి. టేపు రికార్డరు వినికూడ మతి పోగొట్టుకోని పాఠకులు కావాలి. అంతే తప్ప "వంటింటి నవలలు" చదివి మతులు పోగొట్టుకునే అమ్మాయిలులాగా, యండమూరి రచనలు చదివి అబ్బాయిలు వెర్రెత్తి పోకూడదు అక్రమార్జన ఇంత సులభమా- అని ఆశ్చర్యపోకూడదు. అక్రమార్జనలలో అసలైన ఆనందం లేదని గుర్తించే మార్పు మనిషిలో రావాలి. ఈ నవలనుండి యువతరం

# ఆనాడూ ఈ నాడూ కొందరి చర్మ సౌందర్యం ఒక్కటే!





పియర్స్ — అసలైన గ్లిసరిన్ సబ్బు

మీ చర్మానికి ఆ మృదువైన సంరక్షణ ఇవ్వండి— పియర్స్‌తో. సబ్బు తయారు చెయ్యడంలో ఓ శతాబ్దపు అనుభవం స్ఫటికం లాంటి ఆ ప్రతి సబ్బు ముక్కలోనూ ఇమిడి వుంది పియర్స్ ఎంతో సున్నితమైనది. మరెంతో శుభ్రమైనది— దానిలోంచి మీరు చూడగలంతగా।

**పియర్స్ మీ చర్మాన్ని యవ్వనంగా, సుకుమారంగా ఉంచుతుంది.**

ందవలసిన ప్రయోజనమది. పోతే, ఈ నవలలను ప్రధానంగా పఠించవల

రు-ఈ దేశపు లేదా మన రాష్ట్రపు ఆర్థిక రాజకీయ రంగాలను ఉద్ధరించా

దయ పూర్వకంగా అభిలషించే వాళ్లు. షర్ ఎగ్జాంపుల్, రాముస్వాలు,

లేని చట్టాలను చేయటం; చేయాలంటే ప్రజా ప్రతినిధుల సభలకు,

కు ఎంతెంత విలువ యివ్వాలన్నది-అర్థం చేసుకొనడం-ఇదంతా

గా సరే. గురువుగారు శిష్యుడికి చెప్పలేదు గాని ఈ కథ చివరలో

గాంధీ లక్ష్మిల వివాహం, వారు టీ షాపు నుంచి యింటికి వెళ్ళిన

తర్వాత.................★

ఆర్. యస్. కె. మూర్తి

హైదరాబాద్.

---

గమనిక :

"క్రొత్త మలుపు" కథా రచయిత శ్రీ పి. ఏ. ఆర్. శివకుమార్ పేరు 84 పేజీలో పడనందున చింతిస్తున్నాము. వచ్చేనెలనవలానుబంధం "శిథిల సంధ్యా గగనం" - అది 'గమనం' గా ముద్రించినందుకు చింతిస్తున్నాను. ॥సం॥

# కళాసాగరంలో ఊర్వశి



శారద

ఇటీవల మద్రాస్ తెలుగు సాంస్కృతిక సంస్థ కళాసాగర్ వారు శ్రీ డి. యస్. లింగం అధ్యక్షతన ఊర్వశి శారదను ఘనంగా సత్కరించారు.

వెండితెర తడిసేలా ఏడవటం తెర చిరిగేలా అ న.న, ప్రేక్షకుడి కళ్లు దెబ్బతినేలాటి, చెవులు పాడయ్యేలాటి సినిమాఘాతాల మధ్యలో మంచి ఉచ్చారణతో, హుందాగా, సునాయసంగా డైలాగ్ చెప్పడం, నటించడం ఎంతో గొప్ప. అయినా మూడుసార్లు ఊర్వశి బిరుదు తెచ్చుకోవడం కష్టసాధ్యమేగాదు, శారద అద్భుత నటి అని మరోసారి తెలుస్తుంది.

వైభవంగా జరిగిన ఈ సత్కార సభలో జగ్గయ్య, కె. విశ్వనాథ్ దాసరి, మురళీ మోహన్, రావు గోపాలరావు, జయసుధ, సుజాత, జయచిత్ర, ఎం ఎస్. రెడ్డి, రమాప్రభ, అల్లు రామలింగయ్య, ఎస్. జానకి, ప్రేమ్‌నజీర్, మొదలైన సినీప్రముఖులు పాల్గొన్నారు.

సత్కారానికి తన నిరాడంబర సహజత్వంతో శారద కృతజ్ఞతలు చెప్పారు. తరువాత వినోద కార్యక్రమం ఏర్పాటయింది. గత 20 సంవత్సరాలుగా శారద నటించిన చిత్రాల ఫోటో ప్రదర్శన జరిగింది అత్యుత్తమ నటి శారదకు "జ్యోతి" ప్రత్యేక అభినందనలు తెలుపుతున్నది.

# 'జాతిరేఖల' బాపు

శ్రీ బాపూ బాపురేఖనేలా "సీతాకల్యాణం" జరిపించారు 'దృశ్య కావ్యాల' ఈస్టమన్ కలర్ హోరులో ఈ దృశ్యకావ్య దర్శనం మనకి అట్టే జరగకపోయినా "సీతా (అద్భుత) కల్యాణం" విదేశాల్లో ద్విగుణీకృతంగా జరిగింది.

లండన్ టి.వి. చానల్‌లో టెలికాస్ట్ చేశారు. ఆ చిత్రాన్ని కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయం ఇన్‌స్ట్రక్షన్ ఫిలింగా" తీసుకోటానికి నిర్ణయించే శుభవార్త తెలిసింది. నాలుగు లక్షల మంది విదేశీయుల్ని



బాపు

ఆనందార్ణవయానం చేయించిన దేశీయ చిత్ర రమణీయం సారధ్యం వహించిన "చిత్ర" కారుడు బాపుకి, రమణకీ జ్యోతి ప్రత్యేక ప్రశంసలు అందజేస్తోంది.

హ్యూమరాలజీ




శ్రీ అజ్ఞాత పాఠకుడు మాకు ప్రేమతో ఓపిగ్గా పంపిన కార్టూన్ విసురు! ఐతే అది జ్యోతి పాఠకులకి "హ్యూమరస్ స్ట్రోక్" అని ఆయన చమత్కారమూ కలిపేరు. ఆయనకి జ్యోతి అభినందనలు



రావికొండలరావు

మందహాసం, చమత్కారం సరసంగా లభించే చోటు వెదకనక్కరలేకుండా రావి కొండలరావు సినిమా, స్టేజి నటన చూస్తే సరి. అప్పుడప్పుడు హాస్యానికీ జుగుప్సకీ ఆట్టే తేడా లేని సినిమాల్లో చక్కని తేలిక పాటి సరదా వేషం కనిపించడం రావి కొండలరావు

# రావికొండలరావు

ద్వారా అందుబాటులోకి వచ్చింది తెరమీద. 200 సినీహాస్య శిఖరాలని అధిరోహించిన శ్రీ రావి కొండలరావుకి ఇటీవల షష్టిపూర్తి లాగే ఆంధ్రా ఆర్ట్సు సభ్యులు చక్కని సన్మానం జరిపారు. పలువురు సినీ నటులు పాల్గొన్నారీవుత్సవంలో.

హాస్యానికి కరువులేదని కొండగుర్తులా గుర్తుచేసే శ్రీ రావికొండలరావు జ్యోతి మాసపత్రికకి ఇదివరలో సంపాదక సభ్యులుగా పనిచేసిన సంగతి పాఠకులకి తెలుసు. ఆయనకి జ్యోతి హృదయ పూర్వకంగా అభినందనలు తెలియ జేస్తోంది.

---

**ఉదయశ్రీ సాంస్కృతిక సంస్థ (ఐ.డి.పి.యల్.) హైదరాబాదువారు** తమ కళాసంస్కృతిని శ్రీ వేజెళ్ళ సత్యనారాయణకి సత్కారం జరపడంద్వారా తెలియబరచారు. శ్రీ బి. రామారావు గారు సభాధ్యక్షులుగా, శ్రీ నూతన్‌ప్రసాద్ ముఖ్యఅతిథిగా ఈసన్మానాన్ని నిర్వహించారు. శ్రీశివకృష్ణ "అభినందన సంచిక"ని ఆవిష్కరించగా, శ్రీ కె. వి. భాస్కరరావు, శ్రీ బి. వీరభద్రరావు, శ్రీ వంశీ రామరాజు ప్రసంగించారు సంస్థనీ, శ్రీ వెజెళ్ళనీ. అభినందిస్తూ, తరువాత జరిగిన సాంస్కృతిక కార్యక్రమం ఉదయశ్రీ సాంస్కృతిక విశేషం.

---





మద్రాసు తెలుగు సంగీత అకాడమి ఆరంభ సందర్భం.... ఫౌండరు ప్రమోటరు శ్రీ టి. వి. కె. శాస్త్రి, శ్రీ రమణయ్యరాజా, అధ్యక్షులు శ్రీ బాలమురళీకృష్ణ. శ్రీ కోలంక వెంకట్రాజు. శ్రీమతి డి. కె. పట్టమ్మాళ్. శ్రీమతి ఎస్. జానకి. శ్రీ చిట్టిబాబు





సి. వేదవతిగారి "సామెత" పుస్తకం ఆవిష్కరిస్తున్న సందర్భంగా వేదికపై శ్రీ పోతుకూచి సాంబశివరావు. శ్రీ దేవులపల్లి రామానుజరావు. శ్రీ కె. వి. భాస్కరరావు.

**మొదటి ఆమ్మ్రకం।**

ఓ రాష్ట్ర రాజధాని నగరం. ఓ ఖరీదైన కాలనీ. అందులో మరీ ఖరీదైన భవంతి. అందులో పాలరాయి పరచిన గది. ఆ గదిలో ఖరీదైన టీపాయ్. దాని మీద ఖరీదైన మద్యం సీసాలు, కట్ గ్లాసుతో చేసిన గాసులు........

బైట వాతావరణం చల్లగా ఉంది గది కూడ చల్లగా ఉంది. ఆ చల్లదనం పాలరాయి వల్ల కావచ్చు ధనం వల్ల కావచ్చు. గదిలో లైట్లు పాల మీగడ లాంటి, వెన్నెంల్లాటి తెల్లని వెలుగుని కక్కుతున్నాయి.

ఆ గదిలో ఓ పెద్ద మనిషి అటు, ఇటు పచార్లు చేస్తున్నాడు. ఆయన అసహ్యంగా ఉన్నాడు. ఆయనకి ఉక్కగా ఉంది. దాహంగా ఉంది. ఆత్రంగా ఉంది. గదిబైట వాతావరణం కాని, గది లోపలి చల్లదనం గాని ఆయన్ని చల్లబర్చలేక పోతున్నాయి నాల్గేళ్లు ఒకే క్లాసు చదివిన కుర్రాడు పరీక్షకి కూర్చున్నట్టుగా ఆయనకి భయంగా కూడా ఉంది ఆయన కిటికీ దగ్గర నుంచుని గాజు తలుపు ద్వారా బైటికి చూశాడు. తన ఇంటి మెయిన్ గేటు దగ్గర కారు లైటు వెలుగు కనిపించింది ఆయనకి ముచ్చెటమలు పోశాయి.

కారు దూసుకొచ్చి అతని ఇంటిము దాగింది. కారు ఆగే సమయానికి ఆయన ఆఖరి మెట్టు దగ్గర నిలబడి ఉన్నాడు. డ్రైవరు కారు ఒగి వెనకాల డోర్ తెరిచాడు వెనకాల సీట్లోంచి ముగ్గురు దిగారు. ముందు సీట్లోంచి ఒకతను దిగాడు. దిగిన నల్గురిలోను ముగ్గురు అతని మనుషులు. నాల్గో

నలుగురమ్మాయిల కథ / శ్రీభద్రకావ్‌పట్నా



రోజూ పీకమొయ్యా తాగేవాణ్ణి - యజమాని రిక్షా లాగేసుకున్నాడు
గూడెం వాళ్ళందరూ నన్ను వెలేశారు - మా యింటావిడ పుట్టింటికెళ్ళిపోయింది
తాగుడు మానేశా - యజమాని మళ్ళా రిక్షా తీసుకు తోలమన్నాడు
గూడెం వాళ్ళందరూ 'అన్నా' అని కౌగలించుకున్రు
చివరికి యింటావిడ తిరిగింటికొచ్చేసింది - మళ్ళా తాగుడు మొదలెట్టా....



అతన్ని తీసుకురావడానికి వెళ్ళారు. అతన్ని తీసుకొచ్చినందుకు ఆయనకి ఆనందగా ఉన్నా, వ్యవహారం ఏమవు తుందోనని ఆత్రంగా కూడా ఉంది. 'అతిథిని' ఆయన సాదరంగా ఆహ్వానించాడు. మొత్తం అయిదుగురు కలిసి పాలరాతి గదిలోకి వెళ్ళారు సోఫాల్లో కూర్చున్నారు ఆయన బెల్ నొక్కాడు. పని కుర్రాడొచ్చాడు. సీసాల్లో మందు గ్లాసుల్లో పోశాడు. తిను బండారాలు పళ్ళాలో అమర్చాడు. ఏష్ ట్రేలు, సిగరెట్ పెట్టెలు....వాటివాటి స్థానాల్లో అమర్చి బైటకి వెళ్ళిపోయాడు.

ఆ గది విదేశీ మద్యం వాసనతో, మైసూర్ గంధం వాసనతో, ఖద్దరు బట్టల వాసనతో నిండిపోయి ఉంది. గది నిండా పరచుకున్న వెలుగు ఎంత తెల్లగా ఉందో, వాళ్ళ మనసుల్లోని ఆలోచన అంత నల్లగా ఉంది.

ఇంటాయన అందరికీ గ్లాసులందించాడు తను ఒకటి తీసుకున్నాడు. 'ఆయన' విజయం కోసం ఛీర్స్ కొట్టారు నాల్గురౌండ్లు పూర్తయ్యేదాక పిచ్చాపాటీ మాట్లాడుకున్నారు. అప్పటికి వాళ్లు ఫార్మ్‌లోకి వచ్చారు. తాగిన మద్యం వల్ల వాళ్ళలో భీతి పోయింది.



భయం పోయింది. మొహమాటం పోయింది. సిగ్గు, లజ్జ అప్పు పోయాయి. అతి కొద్దిగా మిగిలున్న అంతరాత్మలు ఎక్కడికో పారి పోయాయి.

వాళ్ళు ధైర్యంగా ఉన్నారు. సిబ్బతిగా ఉన్నారు. చదరంగం నుంచి, సరిహద్దు తగాదా దాకా దేన్నైనా ఎదుర్కో డానికి సిద్ధంగా ఉన్నారు.

ఆయన మనుషుల్లో ఒకతను అందుకున్నాడు

"అసలు విషయాని కొచ్చేద్దాం మంత్రిపదవి కోసం వచ్చి రూపాయల కట్ట దాచడమెందుకని వెనకటికో సామెతుంది...." అతను మాట్లాడ్డం పూర్తి కాకుండానే అందరూ ఫక్లున నవ్వారు.

అతిథి గ్లాసు టీపాయ్ మీద పెట్టి గొంతు సవరించుకున్నాడు.

"నేనవతల పార్టీ మనిషికి సపోర్టిస్తానని మాటిచ్చాను. అది వాస్తవం. ఆయనేదో గొప్ప నాయకుడనీ కాదు. దేశాన్ని ఉద్ధరిస్తాడనీ కాదు. ఇందులో నా స్వార్థం నాకుంది.... మొన్న ఎం. ఎల్. ఏ కి నిలబడ్డప్పుడు పెద్ద పోటీ ఎదుర్కోవల్సి వచ్చింది, చాలా ఖర్చయ్యింది. నా దురద కొద్దీ దిగాను. అదిప్పుడు అనవసరం. పిల్ల పెళ్ళి కెదిగింది. పెద్ద కుర్రాడు మెడిసన్ మూడో సంవత్సరంలో ఉన్నాడు. ఏభై వేలు డొనేషన్‌కి అయ్యింది. ఇంకో కుర్రాడు చదువు, చట్టు బండలు లేక రికామీ తిరుగుతున్నాడు. వాడికేగ ఏదైనా బిజినెస్ పెట్టించాలి....ఇవన్నీ ఆ పార్టీ నాయకుడికి చెప్పాను. అన్నీ విన్నాడు-మర్నాడే తన మనిషి చేత ఓ 'అంకె' పంపాడు. ఆ అంకె నాకు నచ్చలేదు. ఆ విషయం చెప్పాను. మరికాస్త పెంచాడు. 'ఇదేవన్నా కూరగాయల బేరమా!' అని ఫోన్‌లో అడిగాను. మళ్ళీ ఇవాళ రాత్రి మనిషిని పంపుతానన్నాడు-అదీ విషయం."

"మీరెంత ఆశిస్తున్నారు?" ఇంటాయన అతిథి నడిగాడు.

అతిథి చెప్పాడు.

"అంత పెట్టలేను." అన్నాడు ఇంటాయన.

"పెట్టలేక పోతే ఏం జేస్తాం మందే ప్రాప్తం అనుకుంటాం" అన్నాడు అతిథి లేని నవ్వు తెచ్చి పెట్టుకుని.

ఇంటాయన తన సహచరుల్ని పక్కకు తీసుకెళ్ళి కాస్సేపు వాళ్ళతో కూడ బలికాడు. అందులో ఒకతను అన్నాడు.

"వెనకాడతారేంటి? వీడు నమ్మకమైన వాడే....మాటంటే నిలబడతాడు పచ్చజెండా ఊపెయ్యండి." అన్నాడు.

ఇంటాయనకి పట్టుదల, ధైర్యం పెరిగాయి.

"సరే-మీరూ ఏవో ఇబ్బందులున్నాయంటున్నారు. రేపు ఉదయమే మీకు క్యాష్ అందుతుంది. కాస్తనమ్మకంగా"

"భలేవారే-నమ్మకం. మాట మీద నిలబడ్డ మా వంశాచారం. మీరు సి. ఎమ్. అవడం గ్యారంటీ" అన్నాడు.

హాల్లో వారంతా భళ్లున నవ్వారు.

నాల్గు రోజుల తర్వాత ఆ పాలరాతి ఇంటాయన ఓ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసాడు.

రెండో అమ్మకం :-

పెద్ద నగరం. అందమైన నగరం. నగరానికి చేర్చి పెద్ద సముద్రం. నదులన్నింటినీ తనలో కలిపేసుకుని మింగేసే సముద్రం. ఆ నగరానికి ఆ సముద్రం వడ్డాణంలా అమరిందని ఓ పాత కవి గారు తన కొత్త కవిత్వంలో వర్ణించారు. బీచ్ అందంగా, హాయిగా ఉంది. వేసవికాలం మూలంగా సాయంత్రమయ్యేసరికి జనమంతా హాయి కోసం, చల్లదనంకోసం, కాలక్షేపం కోసం' నేత్రానందం కోసం ఒంటరి ఒంటరిగా, జంటలు జంటలుగా గుంపులు గుంపులుగా బీచ్‌కి చేరుకుంటున్నారు.

బీచ్‌లో కూర్చున్న ఒందరు చీకటి పడి పోతోందని ఇంటికెళ్ళి పోవాలనీ కొందరు పడుతున్నారు. మరి కొందరు ఇంకా చీకటి పడటం లేదని విసుక్కుంటూ పక్కనున్న వాటవేసి సీరాశగా చూస్తున్నారు. అక్కడ వ్యాపారం వరదలా ప్రవహించే సమయమది. ఐస్‌క్రీంలు, సెనగలు, బఠాణీలు విపరీతంగా అమ్ముడు పోతున్నాయి. కమర్షియలైజేషన్, కమర్షియల్ సివిలిజేషన్ అక్కడ పోటీపడుతున్నాయి. అంత మంది అభిమానుల్ని చూసిన సముద్రం ఆనందంతో ఉప్పొంగి, పొంగిపోతోంది. సింధూరం రంగు సూర్యుడు పదవి కోల్పోతున్న వాడిలా నీరసంగా ఉన్నా, మచ్చలేని నాయకుడిలా గర్వంగా ఉన్నాడు. మచ్చ నింపుకున్న చంద్రుడు లోకానికి మొహం చూపెట్టడానికి సిగ్గు పడుతున్నాడు.

వాళ్లు ముగ్గురు బీచ్‌లో, ఇసుకలో ఒడుపుగా నడుస్తున్నారు. మధ్యలో ఉన్నతను ఖరీదైన గళ్ళపాంటు తెల్ల షర్టు వేసుకున్నాడు. పైకట్టుకున్నాడు. బాగా చదువు కున్నందువల్ల కలిగిన భేషజం మొహంలో తొణికిస లాడుతున్నాయి. రెండో అతను పంచె కట్టుకుని పొడుగు చొక్కా తొడుగు కొన్నాడు. అతను చూడ్డానికి గేదెల వ్యాపారిలా ఉన్నా అతని మొహంలో లౌక్యం, నడకలో తెచ్చిపెట్టుకున్న ఠీవి చూస్తే అతను గేదెలేన్నాద ఏనుగుల్ని కూడా అమ్మించి కొనిపించ గల నేర్పరిలా ఉన్నాడు,

# కేవలం ఒక్క డెట్ బిళ్లలోనే వుంది సాల్వెంట్ పవర్

## బట్టలను అన్నిటికంటే ఎక్కువ తెల్లగా ఉతుకుట కొరకు

క్రొత్త సాల్వెంట్ పవర్

NEW SOLVENT POWER

det

జిడ్డును తీసివేసే,
మురికిని తొలగించే మరియు
మిరమిట్ల తెలుపును
ఇచ్చే శక్తి

Shilpi DM/30 A/81 Tel

**మరే ఇతర డిటర్జెంట్ బార్ లేక బిళ్ల దీనికి సాటి రాదు**

మూ కో ు ి సు కుర్రాడు. లోకం తో అంతా మంచి మాత్రమే ఉందని నమ్మి ఎయిసతసద. ఆశలు, ఆశ యాలు సముద్ర కెరటాల్లా ఎగరు తున్న కువ్వలు పోగుపడ్డ చీకటిలాంటి భవిష్యత్తుని చూసి భయపడే వాడిలా ఉన్నాడు. అతను కొంచెం ఆత్రంగా ఉన్నాడు. మోహంలో ఆశ మిణుకు మిణుకు మంటోంది. సహజమైన వినయమూ, పెద్దల యెడ గౌరవం, ఒ కి, దేశంమీద అభిమానం కలవా డిలా ఉన్నాడు. బాగపడ్డమో, చెడి పోవడమో నిర్ణయమయ్యే వయసులో బాగుపడ్డానికే నిశ్చయించుకున్నవాడిలా హుందాగా కూడా ఉన్నాడు

ముగ్గురు కల్సి చాలా దూరం నడి చారు. మౌనంగానే నడిచారు. కొంత సేపు పిచ్చాపాటీ మాటాడుకున్నారు. ఆలా కొంతదూరం నడిచాక నడి చాక.... పై కట్టుకున్నతను ఆగాడు. మిగతా ఇద్దరు కూడా ఆగి, కాస్త దూరం జరిగి ఏం చెప్ప బోతున్నాడో వినడాని కన్నట్టుగా నుంచున్నారు.

"ఇంతకీ ఏవంటారు?" అన్నాడు పై పంచెకేసి తిరిగి,

"అయ్యా తమరికి తెలియని దేముంది? ఇనయమంతా తమకి చెప్పాను కుర్రాడు మంచిమార్కు లతోనే పాసయ్యాడు. ఉద్యోగం రాక పోతుందా అని ఆడిబాబు పెళ్ళికూడా చేసేసాడు. ఒకళ్లు ఇద్దరయ్యారు. ఇద్దరు ముగ్గురయ్యారు. అంచేత మీరా ఉద్యోగం ఈడికిప్పించే మీ పోటో, ఏది ... మి పోటో పెట్టుకుని రోజూ ఇంత అన్నం ింటాడు."

"అంటే .." ి సి ప ె ముఫ్ర లో ఆపేశాడు.

"ఉత్తి పోటో ఎట్టు ంటావు కాదు-మీ రుణం ఉంచుకోం మ ి మీరే దయతలహాలి...."పంచె ఆపాడు.

"మీరు చెప్పే బా నే ఉం ని ఎంప్లాయ్‌మెంట్ ఎక్సేంజి గొడవొకటు న్నది కదా మధ్యలో"

పంచె వెంటనే అందుకున్నాడు.

"అది మేం జూసుకుంటాం, ఎంప్లా య్‌మెంట్ సం ి మాకువొదిలేయండి మిగతా పని మీరు చేసి పెట్టండి." అన్నాడు,

"చెయ్యొచ్చుకాని ... మా బాపు రిది ఇం కెవళ్ళో తీసుకొచ్చాడు. అతను వేటాడేస్తున్నాడు అతనితో ఓ ంట కాదు_ మీరు ఊ అనండి తెల్లా ి ి కి మీ ఇంట్లో . పీ. పెట్టేస్తాని ి న్నాడు. అతన్ని ఆపేసికి తాటలు ి వచ్చారు." అని పై సముద్రం కేసి తిరిగి నిలబడ్డాడు,

లోకం తెలియని కుర్రాడికి లోకం తెలుస్తున్నట్టుగా ఉంచె, పంచె ఆ కుర్రా

దీని పక్కకి తీసికెళ్ళి ఏదో మాట్లాడాడు

"బాబూ! మేం కూడా అంతా మరీ పనికి మాలినోళ్ళం కాదు లెండి. మా పని మావాలి- అదే ముఖ్యం. రేపు సాయంత్రం మీ ఇంటికాడ దర్శనం చేసుకుంటాం, అసలు పొద్దున్నే వచ్చేద్దుము గాని బ్యాంకులు తెరవరు-" అని చెప్పి పంచె కుర్రాణ్ని తీసుకుని వెళ్ళిపోయాడు.

పై మనసు సముద్రంలా పొంగిపోతోంది.

మర్నాడు సాయంత్రం ఆరు గంటలకి పై వాళ్ళుగా కట్టుకున్న ఇంటిలో కొత్త ఫ్రిజ్ అందంగా తళా తళా మెరిసిపోయింది.

వారం తర్వాత లోకం తెలియని కుర్రాడు ఓ పెద్ద గవర్నమెంటు కంపెనీలో ఉద్యోగిగా చేరి- జీవితంలో ముందుకిపోవాలని గట్టిగా నిర్ణయించుకున్నాడు, అతనికి లోకం ఇంకా చీకటిలా కనిపిస్తున్నా దబ్బనే ఫ్లడ్ లైటుకి చెదిరిపోయే చీకటిలా మాత్రం కనిపిస్తున్నది.

మూడో దృశ్యం:-

అదో పెద్ద రెల్వేస్టేషన్, రాష్ట్రాన్ని కల్లా పెద్ద రైల్వే జంక్షన్. అటుపోయే పెద్ద రైళ్ళన్నీ అక్కడే చాలాసేపు ఆగుతాయి, అక్కడ రైలు నడిపే ఉద్యోగులు షిఫ్ట్ మారతారు.

రాత్రి బాగా పొద్దుపోయింది, ప్రపంచమంతా గాఢ సుషుప్తిలో ఉంది, కాని ఆ రైల్వేస్టేషన్ మాత్రం మెలకువగానే రాక, సందడిగా కూడా ఉంది. ముఖ్యమైన ప్రదేశాలకు వెళ్ళే రైళ్లు ఆగే సమయమది. నిద్రపోతున్న ప్రయాణీకులు చాలా మంది కాఫీ కుర్రాళ్ళ కేకలకు లేచారు, కొందరు కాఫీలు తాగుతున్నారు. కొందరు ఫ్లాట్‌ఫాం మీద నిలబడి సిగరెట్లు తాగుతున్నారు. మరికొందరు అటు ఇటు పచార్లు చేస్తున్నారు.

పళ్ళు అమ్మేవాళ్లు, సిగరెట్లు బిస్కట్లు అమ్మే వాళ్లు, సామానులు మోసే కూలీలు, గుండె అవిసేలా ట్రాలీలు చేసే చప్పుడు, హడావిడిగా సందడిగా గోలగోలగా ఉంది స్టేషను. అనౌన్సర్ వస్తున్న నిద్రనాపుకుని అనేక భాషల్లో రైళ్ళ రాకపోకలను గురించిన ప్రకటనలు చేస్తున్నాడు. ప్రకటనలు చేయడానికి గొంతులు మార్చి వినసొంపుగా వున్న గొంతుని వికృతంగా వినిపిస్తున్నాడు.

ఓ ముఖ్యమైన రైలు వచ్చి ఆగింది. సందడి ఎక్కువయింది ఆ రైల్లో రిజర్వేషన్ లేకుండా ప్రయాణం చేయటం కష్టం. ఓ సెకండ్ క్లాస్ స్లీపర్ నుంచి కండక్టర్ దిగాడు. కొది క్షణా తర్వాత మరో కండక్టర్ వచ్చి అతన్ని కలిశాడు వాళ్లు డ్యూటీ మారుతున్నారు.... దిగు

తున్న కండక్టర్ డ్యూటీ ఎక్కుతున్న కండక్టర్‌కి ఓ కాయితం ఇచ్చాడు. అది చూసిన కొత్త కండక్టర్‌కి ఆనందం వెలిగింది.

మరుక్షణం అతని చుట్టూ జనం గుమిగూడారు. వాళ్ళంతా బెర్తులకోసం ప్రయత్నిస్తున్న వాళ్లు.

"ఇంకా చార్టు చూడలేదండీ చూస్తే గాని చెప్పలేను." కండక్టర్ అందరిని ఉద్దేశించి అన్నాడు.

అయినా ఎవరూ అతన్ని వదలి వెళ్లలేదు.

కండక్టర్ దగ్గర్లో ఉన్న టీ స్టాల్‌కి వెళ్ళాడు. అతను సిగరెట్లు కొనుక్కుని వెళ్ళాడు. జనం కూడా వెళ్ళారు. అతను ప్లాట్‌ఫాం మీద అటు ఇటు తిరుగుతున్నాడు. జనం కూడా తిరుగుతున్నారు. తల్లి పంది వెడుతుంటే పిల్ల పందులు కూడా వెళుతున్నట్టుగా ఉంది. మధ్యలో వాళ్లు బెర్తు గురించి అడుగుతూనే ఉన్నారు. "బెర్తు లెక్కడున్నాయండి బాబూ!" అని అతను అంటూనే ఉన్నాడు.

ఓ యువకుడు కండక్టరు దగ్గరికి వెళ్ళి "ఇరవయి రూపాయలు ఇస్తాను బెర్తు ఇవ్వండి," అని చెప్పాడు కండక్టర్ ఏమీ మాట్లాడలేదు. మరో ఐదు నిమిషాల్లో బండి బయలుదేరుతుంది.

నలుగురు ప్రయాణీకులు ఒడుపుగా తలో ఏభై నోటు కండక్టర్ చేతిలో పెట్టారు ఇచ్చినట్టు వాళ్ళకీ, కండక్టర్‌కీ అప్పుడు మంవ్వరికీ తెలియ[illegible] కరికి తెలియకుండా ఇవ్వడంలో వాళ్ళు అనుభవజ్ఞులు, తీసుకోవడంలో అతను అనుభవజ్ఞుడో కాదో అనుమానం వచ్చేంత రహస్యంగా జరిగిపోయింది.

"వెళ్ళి కంపార్ట్‌మెంట్‌లో కూర్చోండి." అన్నాడు కండక్టర్.... వాళ్ళు నలుగురూ వెళ్లి కూర్చున్నారు.

మిగతా జనం కండక్టర్ కూడా తిరుగుతున్నారు

"బెర్తులేవంటే వినిపించుకోరేం?" కండక్టర్ విసుక్కున్నాడు.

జనం దూరంగా వెళ్ళిపోయారు

అనౌన్సర్ బండి బయల్దేరుతున్నట్టుగా ప్రకటించాడు.

బండి కూతవేసింది.

"బోణీ రెండొందలు. ఈ ట్రిప్ బాగానే ఉండేట్టుగా ఉంది." అనుకున్నాడు కండక్టర్.

బండి బైల్దేరింది.

## నాలుగో అమ్మకం :-

అర్ధరాత్రి కావడానికి మరో గంట సేపుంది. పాపంలాంటి చీకటి ప్రపంచాన్నే చుట్టుముట్టింది. చీకటి తప్పులు చెయ్యడానికి కావల్సినంత చీకటి, మంచి పౌరులుగా బతకాలనుకునేవాళ్లు

పుణ్యాత్ములు కావాలనుకునేవాళ్లు భయపడి ఇళ్లల్లో దాక్కునే సమయమది, ప్రపంచాన్ని నిద్రలేకుండా ముంచెయ్యగలవాళ్లు. దేశాన్ని అమ్మెయ్యగలిగిన వాళు హడావుడిగా సంచరించే సమయమది.

సరిగ్గా ఆ సమయంలో ఆమె బస్ షెల్టర్‌లో నుంచునుంది. చలిగాలికి కొంగు తలచుట్టూ కప్పుకొంది, ఎర్ర బార్డరున్న తెల్లచీర కట్టుకుంది, తల్లో పూలు తురుముకుంది దూరానికి ఆకర్షణీయంగా, యౌవ్వన ంలా కనిపించినా దగ్గర్నుంచి చూస్తే తొందరగా యౌవ్వనం పోగొట్టుకున్నదానిలా, బతుకు భారంలా పడిపోయిన మనిషిలా అనిపిస్తుంది, ఆమెకు యెలాగో అలా బతికెయ్యాలన్న ఆశ, ఆకలి తీర్చుకోవాలన్న ఆరాటం తప్ప, ప్రపంచంమీద ద్వేషం; పగలాంటివి ఏవీ లేవు అవి పెంచుకునేంత చదువు కాని, తెలివితేటలు కాని ఆమెకు లేవు. రేపు ఏం జరుగుతుందని కాక- ఈ భయంకరమైన రాత్రి ఎలా గడుస్తుందన్న ఆలోచన ఆమె మెదడులో నిండుకుంది. గతం తాలుకు భయంకరమైన నిప్పురవ్వ లాంటి ఆలోచనలు ఆమె దరిజేరనివ్వడము లేదు. ఆమెకు దేవుడంటే భక్తి తన వోనర్ అంటే భయం, పోలీసులంటే భయము భక్తి ఉన్నాయి. 25

ఆమె గంటకుపైగా అక్కడే నిలబడివుంది ఇద్దరు మగాళ్లు బస్‌కోసమన్నట్టుగా ఆ షెల్టర్ దగ్గర నిలబడ్డారు. వాళ్లు వెనక్కి తిరిగి ఆమెను దొంగ చూపులు ... తప్ప ఏమీ మాట్లాడలేదు. దగ్గరిగా కూడా రాలేదు. వాళ్లు తనకోసము వచ్చిన వారు కాదని, ఊరికే తనని చూడ్డానికి అక్కడ నిలబడ్డారని ఆమె త్వరిగానే గ్రహించింది మరి కాసేపట్లో వాళ్లు నడుచుకుంటూ వెళ్లిపోయారు,

మరి కొంతసేపు పోయాక ఓ ఆటో వచ్చి అక్కడే ఆగింది అందులో ముగ్గురు మగాళ్లున్నారు. ఒకతను కిందకి దిగి దూరంనుంచేఆమెను పరకాయించి చూశాడు ఆమెకు దగ్గరిగా వచ్చి నిలబడ్డాడు ఆమె అతని కేసి చూసింది.

"ఇప్పుడు ఏమీ తాలూకు మనిషివా?" తనడిగాడు.

"అవును," అందామె.

"నీ పేరు"-

ఆమె చెప్పింది

"రూంకి తీసుకెడతాం వస్తావా?"

"అందుకే ఇక్కడ నిలుచున్నది."

"ఎంతిమ్మంటావ్?"

"ఎందరున్నారు?"

"ముగ్గురం,"

"పై అర రూపాయలివ్వండి."

"ఏంటి బంగారందరు చెప్తున్నావ్?

ఆమె నవ్వి "బంగారం కొనాలన్నా ఇంత అర్ధరాత్రి ఎక్కడ దొరుకుతుంది" అంది.

"సర్లె మరో రేటు చెప్పు"

"ముగ్గురున్నారు, పైగా వస్తాదులా ఉన్నారు. చలికాలం కాబట్టి మందులో ఉండి ఉంటారు. మనిషికిరవై ఎక్కువ కాదు."

అతను ఆటో దగ్గరి కెళ్ళి మిగతా ఇద్దరితో సంప్రదించాడు. మళ్ళీ ఆమె దగ్గరికి వచ్చాడు

కాస్సేపు తర్జన భర్జనలు, బేరసారాలు సాగాయి.

వృత్తి నేర్పిన నిర్భయత్వం ఆమె మాటల్లో తెలుస్తోంది.

అతను కొన్ని నోట్లు ఆమె చేతిలో పెట్టాడు. ఆమె వాటిని లెక్కపెట్టి జాకెట్‌లో పెట్టుకుంది.

ఆటో దగ్గరి కెళ్ళి "నేనెక్కడ కూర్చోను." అంది.

"మా వాళ్ళో" అన్నాడతను,

ఆమె నవ్వుతూ ఆటో ఎక్కింది.

ఆటో చీకటిని చీల్చుకుంటూ పెద్ద చప్పుడు చేసుకుంటూ, బైల్దేరింది.

o o o o

ప్రపంచంలో రోజు రోజుకి అమ్మకాలు చాలా పెరుగుతున్నాయి, ప్రతి మనిషి ఏదో ఒకటి అమ్ముకుని బతకడానికి ప్రయత్నిస్తున్నాడు, పైన చెప్పిన నాలుగు అమ్మకాలలోను చివరిది మరీ నీచమైందిగా భావించబడుతున్నది.

కాని ఆ అమ్మకం పదవి కోసం కాదు సంపద పెంచుకోడానికి కాదు, ఆస్తిని అంతస్తుని పెంచుకోడానికి కాదు

బతకడం కోసం ... కేవలం బతకడం కోసం....

పొట్టనింపుకోడం ప్రాథమిక అవసరం.... బతకాలనుకోడం ప్రాథమిక హక్కు. కేవలం ఆ అవసరం కోసం ఆమె పడే యాతన, శ్రమ, పీడన.... డార్విన్ సిద్ధాంతం లోని మొదటి పాఠం....

'బతకడం కోసం వేదన'....

నాకు ఆ మనిషంటే జాలి, దయ, సానుభూతి........

బతుకు కోసం వేదనపడే మనుష్యులకి ప్రతినిధి . ........

ఆమె మీద నాకు కొండంత గౌరవం........ ★

పిల్లలిద్దరూ యింటికి వచ్చారంటే చాలు నీరసంగా వాలిపోయేవారు...

**మరిప్పుడు గ్లోకీన్-డి యొక్క శక్తి వచ్చిన తర్వాత అంటారా... మరిక చూడండిక!**




కొత్త, మెరుగైన గ్లోకీన్-డి పిల్లకి రోజంతటికి కావలసిన జవ జీవాలను యిస్తుంది. గ్లూకోజ్, కాల్షియమ్ ఫాస్ఫేట్లు, దాంతోనే విటమిన్-డి, వీటియొక్క సత్తువతో నిండిన గ్లోకీన్-డి, మరి యిప్పుడిక మరింత త్వరగా కరుగుతుంది. ఇక దాంతోబాటే కొత్త, ఆకర్షణీయమైన ప్యాక్‌లో.




**రోజూ గ్లోకీన్-డి తీసుకోండిక, మరిక చూడండిక!**

**కొత్త,మెరుగైన గ్లోకీన్-డి శక్తినిచ్చేది,రోజంతా!**

ULKA-GD-2-83 TEL

# ప్రణయపాతకాలు

మూలం : బార్బరా కార్ట్‌లాండ్

స్వేచ్ఛానువాదం : భూసిరెడ్డి సీతాదేవి

( జరిగిన కథ )

హార్వేకి హైదరాబాద్ నవాబు ఆహ్వానంరావడంతో ఇండియా బయలు దేరడం జరిగింది. తను రాస్తున్న స్క్రిప్టు ఫెయిర్ రాయడంకోసం సీతని తనవెంట తెస్తున్నాడు. అతని బాధలుపడలేని సీత తన అఘాయిత్యం చెడగొట్టిన యువకుడిలో రహస్యాన్ని, వేదాంతాన్ని పసిగట్టింది. అతని నుంచీ ధైర్యం పొందింది. తన తలిదండ్రుల మరణం గుర్తొచ్చింది. హార్వేని ధైర్యంగా ఎదిరించాలని నిర్ణయించింది. అయినా భయం.

( జరుగవలసిన కథ )

ఆమె వంగి కాగితాలు తీసుకోలేదు.

హార్వే చెయ్యి ఎత్తాడు.

సీత దెబ్బ పడకుండా పక్కకు తప్పుకొన్నది. రెచ్చిపోయిన కోపంతో మళ్ళీ చెయ్యెత్తాడు.

అంతలో ఎవరో క్యాబిన్ డోర్ కొట్టారు.

ఎత్తిన చెయ్యి గాలిలోనే ఉండిపోయింది.

"లోపలకు రావచ్చు" చెయ్యి దించుతూ అన్నాడు హార్వే.

ఆ మాటలు పూర్తికాకుండానే డాక్టర్ లోపలకు వచ్చాడు.

అతని వయసు దాదాపు ఏభయ్యేళ్లుంటాయి. బట్టతల. లావుగా ఉంటాడు. ఎప్పుడూ నవ్వుతూ ఉంటాడు. అతను ఓడలో పనిచేసే డాక్టర్ అని హార్వేకు తెలుసు. సీత అతన్ని చూడగానే కళ్ళు తుడుచుకొని తనకు దెబ్బలు తప్పించిన అతనికి మనసులోనే కృతజ్ఞతలు చెప్పుకొన్నది.

తన బాబాయి కేకలు వినే అతను లోపలికి వచ్చి ఉంటాడు అని అను కొన్నది సీత.

"ఏం కావాలి?" హార్వే కనుబొమ్మలు చిట్లించాడు.

"మిమ్మల్ని డిస్టర్బ్ చేసినందుకు విచారిస్తున్నాను. మిస్టర్ హార్వే మీతో ఉన్న అమ్మాయి ఇవ్వాళ మీతోపాటు బ్రేక్‌ఫాస్ట్‌కి రాలేదు...."

"అయితే?"

"ఆమె ఆరోగ్యం బాగాలేదనే అనుమానం కలిగింది."

"అలా ఎందుకనుకొన్నారు? మా అమ్మాయి ఆరోగ్యానికేం? దివ్యంగా ఉంది, బ్రేక్‌ఫాస్ట్‌కు ఆలస్యంగా వెళ్ళింది. మీకు తెలియందేముంది ఈ రోజులలో యువతీ యువకుల బద్ధకం గురించి? మా సీతకు ఈ మధ్య సోమరితనం బలిసిపోయింది. అందుకే ఆలస్యంగా నిద్ర లేచింది."

"మీరు చెప్పింది నిజం కావచ్చును. కాని నేను ఆమెను పరీక్షించాలి." డాక్టర్ అన్నాడు.

"ఎందుకూ?" తీవ్రంగా పలికింది సర్ హార్వే స్వరం.

అదేమీ పట్టించుకోనట్టే డాక్టర్ క్యాబిన్ తలుపువేశాడు. సీత దగ్గరకు వచ్చాడు.

"మిస్ ఆరాన్ ముఖం మీద రాష్ వచ్చిందని విన్నాను. అది ఒకవేళ అంటువ్యాధి అయితే షిప్‌లోవున్న వాళ్ళందరికీ పాకుతుంది" అన్నాడు డాక్టర్.

సీత డాక్టర్ ముఖంలో ఆశ్చర్యంగా చూసింది.

అతను తన బుగ్గమీదవున్న దెబ్బను ఉద్దేశించి అంటున్నాడని గ్రహించింది సీత.

రాత్రి తన బాబాయి కొట్టాడు. ఆ దెబ్బ తగిలన చంప ఎర్రగా కంది పోయి ఉన్నది. తనను రక్షించిన అతను బాబాయి తనను కొట్టాడని విన్నప్పుడు చాలా బాధపడ్డాడు. వినగానే నమ్మలేనట్టు బిత్తరపోయాడు.

"నేను........నేను........బాగానే.....ఉన్నాను." గొణిగినట్లుగా అన్నది.

అదే సమయంలో సర్ హార్వే "మా అమ్మాయి బాగానే ఉంది. ఆమె చంపమీద మార్కు ఉన్నదన్నమాట నిజమే. అది నీకు అనవసరం" దాదాపు అరిచినట్టే అన్నాడు హార్వే.




"క్షమించాలి....మిస్టర్ హార్వే....అది నా డ్యూటీ. ఈ షిప్‌లో ఎవరికి ఏ కొంచెం అనారోగ్యం ఏర్పడిందని తెలిసినా, వాళ్ళను పరీక్షించడం నా కర్తవ్యం" అన్నాడు డాక్టర్.

"నాన్‌సెన్స్" అరిచాడు హార్వే.

వెళ్ళి తన కుర్చీలో కూర్చున్నాడు. డాక్టర్‌తో వాదించడంగానీ, మాట్లాడటంగానీ తనకు ఇష్టంలేదని తెలియజేయటానికన్నట్లు టేబుల్ మీద ఉన్న కాగితాలు తిరగెయ్యసాగాడు.

"డాక్టర్ హార్వే నాకు అర్థమయింది." అన్నది సీత.

"నీ క్యాబిన్‌లోకి వెళదామా? లేక ఇక్కడే పరీక్షించమన్నావా?" డాక్టర్ సీతను అడిగాడు.

"ఇక్కడే చూడవచ్చును. నా వెనక అనవసరమైన విషయాలు చెప్పి, పిల్లను భయపెట్టడం నాకిష్టంలేదు" హార్వే గంభీరంగా అన్నాడు.

"అనవసరమైన విషయాలు చెప్పాల్సిన అవసరం నాకులేదు. ఒకసారి పరీక్షించి ఆమె ఆరోగ్యం గురించి తెలుసుకోవడం నా విధి." అన్నాడు డాక్టర్.

డాక్టర్ సీతను చూశాడు. చిరునవ్వు నవ్వాడు.

"కాస్త వెలుగులోకిరామ్మా! నీ చంపమీద ఉన్నది ఏమిటో పరీక్షించాలి"

సీత తనురెప్పల్ని టపటపలాడించింది. డాక్టరుకు తన చంపమీద దెబ్బ పడటం వల్లనే అలా ఎర్రగా ఉబ్బిందని తెలుసునని అర్థంచేసుకున్నది.

సీత కొంచెం వెలుగులోకి వచ్చి నిలబడింది.'

డాక్టరు ఆమె చంపను మృదువుగా నిమిరి చూశాడు.

"దెబ్బ తగిలిందా?"

"కొంచెం" తడబాటుగా అన్నది.

"మచ్చ పడొచ్చును కాని త్వరలోనే పోతుంది. భయపడకు" అన్నాడు డాక్టర్ జాన్సన్.

సీత చూస్తూ నిల్చుంది.

"వెనక్కు తిరుగు వీపు చూడాలి, సాధారణంగా అంటు జబ్బులు చెవుల కిందా, వీపుమీదా మొదలవుతాయి."

సీత యాంత్రికంగా వెనక్కు తిరిగింది. గౌనుకున్న గుండీలను తియ్య సాగింది.

"నేను తీస్తాను నేను పెళ్ళయినవాణ్ణి. పెద్ద వాడిని. పైగా డాక్టర్ను. నీకు సంకోచం అక్కర్లేదు" అంటూ వీపుమీద గుండీలు విప్పాడు.

రాత్రి తన బాబాయి రూలర్‌తో కొట్టిన దెబ్బలు తాలుకు వాతలు స్పష్టంగానే కన్పిస్తాయని ఆమెకు తెలుసు. రాత్రంతా వీపు మంట పుట్టింది.

"ఈ వాతలు అంటు జబ్బుకు సంబంధించినవి కావు. అయినా నేను చెప్పేది విను."

"వింటున్నాను" అన్నది సీత.

"ఇవి పెద్దగా పట్టించుకోవలసిన గాయాలు కావు. అయినా మరోసారి ఇలా జరిగితే నా దగ్గరకు వచ్చి చూపించు" అన్నాడు డాక్టర్.

"అలాగే డాక్టర్!"

డాక్టర్ తలతిప్పి హార్వేకేసి చూశాడు.

హార్వే చేతిలో ఉన్న పేపర్లు చూస్తున్నాడు.

"మిస్ ఆరాన్! నువ్వు ఇలా బాధపడనక్కరలేదు. ముందు ఇలాంటిది జరిగితే వెంటనే నా దగ్గరకురా!" అన్నాడు డాక్టర్ సీతతో చిన్నగా.

సీత డాక్టర్‌ని చూసింది.




అతను సానుభూతి వ్యక్తం చేస్తున్నట్లుగా చిరునవ్వు నవ్వాడు, ఆమెకు అతని అభిప్రాయం అర్థమయింది.

డాక్టర్ బయటకు నడిచాడు. తలుపు దగ్గర నిల్చుని వెనక్కు చూస్తూ "మిస్టర్ హార్వే! గుడ్ మార్నింగ్" అన్నాడు.

హార్వే ఆ మాటలు విననట్టే కాగితాలలోకి చూస్తూ ఉండిపోయాడు, సమాధానం లేదు. డాక్టర్ ముసిముసిగా నవ్వుకుంటూ వెళ్ళిపోయాడు.

సీత ఇబ్బందిగా హార్వేకేసి చూసింది. ఆ నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ మాట్లాడే ధైర్యం ఆమెకు లేదు. చూస్తూ నిల్చుంది.

"ఇంకా అక్కడే నిల్చున్నావేం? రా! వచ్చి పనిచెయి! ఎంతో పని అలాగే ఉండిపోయింది"" అన్నాడు సర్ హార్వే.

సీత కదిలింది. ముందుకు నడిచింది. అంతకుముందు హార్వే విసిరి కొట్టిన కాగితాలను వంగి ఒక్కొక్కటే తీసుకోసాగింది,

మళ్ళీ ఎవరో తలుపు కొట్టారు.

"చెప్పడం మరచిపోయాను మిస్టర్ హార్వే, మిస్ ఆరాన్‌కు వేరే క్యాబిన్ ఇప్పిస్తున్నాను. ఇప్పుడు ఆమె ఉంటున్న క్యాబిన్‌లో గాలీ-వెలుతురు కూడా చాలా తక్కువగా ఉంది" అన్నాడు డాక్టర్ డోర్ తెరిచి పట్టుకొని,

"నేను అంత డబ్బు కట్టుకోలేను." సర్ హార్వే విసుగ్గా అన్నాడు.

డాక్టర్ జాన్సన్ హార్వే క్యాబిన్‌ను పరిశీలనగా చూశాడు. అది చాలా పెద్దగా ఉంది. బోలెడంత గాలీ, వెలుతురు ఉన్నాయి ఆ గదిలో.

"ఆ విషయం నేను ముందే ఆలోచించాను. నువ్వు ప్రత్యేకంగా నేను ఏర్పాటుచేసిన క్యాబిన్‌కు ఎక్కువ డబ్బు కట్టనక్కర్లేదు. ఆ క్యాబిన్‌లో మిస్ ఆరాన్‌కు ఏలాంటి కష్టం ఉండదు ఆమె ఆరోగ్యానికి మంచిది" డాక్టర్ మృదువుగా సమాధానమిచ్చాడు.

డాక్టర్ హార్వే సమాధానానికి ఎదురుచూడలేదు. తలుపుమూసి వెళ్ళిపోయాడు.

"చాలా చాలా కృతజ్ఞతలు." సీత చిన్నగా అన్నది తనకుతానే చెప్పుకుంటున్నట్లుగా.

ఆమె మనసు హాయిగా తేలిగ్గా గాలిలో తేలిపోతున్నట్లుగా ఉన్నది.

ఆ క్యాబిన్‌లో నుంచి సముద్రం కన్పిస్తుంది. ఇకపైన బాబాయి తనకు కొట్టడానికి సాహసించడు.

తనను తెలుసు డాక్టర్‌ను ఎవరు పంపించారో?

ఆలోచిస్తూ పేపర్సు తీసుకోసాగింది.

సర్ హార్వే అవమానంతో దహించుకుపోసాగాడు. డాక్టర్ దగ్గిర మాట్లాడలేకపోయాడనే బాధగాఉంది. సీతనుచూస్తుంటే వళ్ళు మండిపోతున్నది.

కానీ సీతకు భయంగాలేదు. ఆమెకు వెన్నెముకలో కొత్తగా బలం వచ్చినట్టుగా ఉన్నది ఆమె ఆలోచిస్తున్నది.

అవును! అతనే డాక్టర్‌ను పంపించాడు. ఇందులో ఏ మాత్రం సందేహం లేదు. అతనే తన చంప ఎర్రగా కంది ఉండటాన్ని గమనించాడు. అది దెబ్బవల్ల ఏర్పడ్డ అచ్చవడి అని అతను చూడగానే తెలుసుకున్నాడు.

అతనికి ఇంత పరపతి ఉందా? చూడ్డానికి పల్లెటూరి వాడిలా బీదవాడిలా ఉన్నాడు. భారతీయుడిలా కూడా ఉన్నాడు. తన అనుమానం కూడా-అదే- అతను మారువేషంలో ఉన్నాడన్న అనుమానం-ఆధార రహితం కాదని తోస్తుంది.

నేలమీద ఉన్న కాగితాలను బొత్తిగా పెట్టుకొని తన క్యాబిన్‌కు వెళ్ళింది సీత. కొత్త క్యాబిన్‌లోకి మారింది. అది విశాలంగా ఉన్నది. గాలీ, వెలుతురూ పుష్కలంగా ఉన్నాయి. ఆమెను అతని తలపులు వదలడంలేదు. క్యాబిన్‌లో

# లిమ్కా పానం బలే మజా
# కారణాలెన్నో ఉన్నాయి తెలుసా



లిమ్కాలో నాకు విటమిన్ సి లభిస్తుంది.

నిమ్మకాయ కమ్మదనం, జిల్లనే తియ్యని రుచి వుంటాయి.

ఐసోటానిక్ లవణాలు నా దాహం తీరుస్తాయి.




క్రిమిరహితమైన లిమ్కా నా ఆరోగ్యాన్ని పాడవనివ్వదు.

చల్లని లిమ్కా నా మనస్సుకి ఆహ్లాదం కలిగిస్తుంది.

**లిమ్కా**

ఎంతోసేపు కూర్చోలేక పోయింది. డెక్ మీదకు వెళ్ళింది. అతను కన్పిస్తాడనే ఆశతోనే వెళ్ళింది.

డెక్స్ పైన చాలామంది ఉన్నారు. కొందరు విశ్రాంతి తీసుకుంటున్నారు. కొందరు పేకాట ఆడుతున్నారు. మరి కొందరు తమ పిల్లలతో ఆడుకుంటున్నారు. సీతకళ్లు నలువైపులా వెతుకుతున్నాయి. తనకు కావాల్సిన వ్యక్తి కన్పించలేదు. అతని పేరు ఆమెకు తెలియదు. ఎవర్నిఅడగాలో ఎలా అడగాలో బోధపడటం లేదు. అతని పేరు తెలుసుకోనందుకు ఆమెకు తనమీద తనకే కోపం వస్తోంది.

అతను మాత్రం తనపేరు తెలుసుకున్నాడు. అతడు తన పేరు చెప్పలేదు. తను కూడాచెప్పకుండా ఉండాల్సింది.

ఇక ఇవాళ కన్పించడు.

రేపు కన్పిస్తాడా?

ఏమో!

అతనికి తనను చూడాలని ఉంటే కన్పిస్తాడు.

సీత తిరిగి తన క్యాబిన్‌లోకి వచ్చింది.

పని చెయ్యాలని కూర్చుంది. కాని మనసు లగ్నం కావటంలేదు. కళ్లు మూసుకొని అతని రూపాన్ని గుర్తు చేసుకొంటూ పడుకొన్నది. సాయంత్రం వరకూ అలాగే పడుకొన్నది.

సాయంకాలం తను సాధారణంగా వేసుకునే దుస్తులు వేసుకున్నది. అంతలోనే ఏదో ఆలోచన వచ్చింది.

అతను కన్పిస్తాడేమో! కాస్త మంచి గౌను వేసుకుంటే? అమ్మ గౌను వేసుకొంటే? అది చాలా ఖరీదైనది. కానీ తనకు అది చాలా పెద్ద సైజు. వదులుగాఉంటుంది. అయినా పర్వాలేదు. అందులో తనను చూసినవాళ్లు తనను గొప్పింటి పిల్లగా భావిస్తారు.

ఆలోచిస్తూ తల్లి గౌను వేసుకొని అద్దంలో తన ప్రతిబింబాన్ని చూసుకొన్నది. గౌను వదులుగా ఉంది. తనరూపం తనకే నవ్వు వస్తోంది.

ఆమె బయలు దేరేప్పుడు మిస్టర్ హార్వే కొంచెంగా డబ్బు ఇచ్చాడు. రెండు గౌన్లు కుట్టించుకొన్నది. అవి సాధారణ దుస్తులే, అయినా కొత్తవి. అందుకే భారతదేశం వెళ్ళాక వేసుకోవాలని దాచి పెట్టుకొన్నది.




ఒకప్పుడు ఆమె బాబాయి భారతదేశంలో పెద్ద పదవిలో ఉన్నవాడు. అందుకే ఆతనికి చాలామంది గొప్ప స్నేహితులు ఉండి ఉంటారనీ, వాళ్ళందరూ ఆయనను కొన్నాళ్ళకు ఆహ్వానిస్తారనీ, అప్పుడు తను కూడా వెళ్ళవలసి వస్తుందనీ సీత భావించింది. ఆ భావంతోనే కొత్త గౌన్లు జాగ్రత్తగా భద్రపరచింది.

భారత దేశంలో ఎక్కడ ఉంటారో ఆమెకు తెలియదు. తెలుసుకోవాలని ఉన్నా, మిస్టర్ హార్వే చెప్పడని ఆమెకు తెలుసు. అందుకే అడగలేకపోయింది. భారత దేశం గురించి ఎన్నో విషయాలు తెలుసుకోవాలనే కుతూహలం ఉన్నది.

కాని ఆమె తన బాబాయిని ఒక్క ప్రశ్న కూడా అడగలేదు. ఆలా అడిగితే సమాధానాలు దొరికినా సరికదా తిట్లు తినాల్సి ఉంటుందని ఆమెకు తెలుసు. మిస్టర్ హార్వేతో ప్రయాణం చెయ్యడం ఆమెకు ఇష్టంలేదు. అయినా తప్పలేదు. వేరే గత్యంతరం లేదు.

సీత తన బాబాయితో రాత్రి భోజనానికి కూర్చుంది. కాప్టెన్ వాళ్ళను ఆహ్వానించాడు. కాని మిస్టర్ హార్వే అందరికీ దూరంగా వెళ్ళి కూర్చున్నాడు. సీత కూడా వెళ్ళి అతని పక్కనే కూర్చుంది. అక్కడ ఉన్నవాళ్లు కొందరు మిస్టర్ హార్వేని చూసి ముసిముసిగా నవ్వుకోవడం సీత గమనించింది. ఎప్పటిలాగే మిస్టర్ హార్వే మౌనంగా భోజనం చేస్తున్నాడు.

హార్వే ఎవరితోనూ చనువుగా మాట్లాడడు భోజనాల దగ్గిర, వంట బాగా లేకపోతే మాత్రం, వంటవాళ్ళమీద కేకలు వేస్తాడు.

భోజనం ముగించి లేచాక.

"సీతా! ఇక నువ్వు నీ కేబిన్‌కి వెళ్లు. రాత్రి కూడా పనిచెయ్యలేదు. రేపటికి మొత్తం పని పూర్తిచెయ్యాలి. తెల్సిందా? సోమరితనం అంటే ఎంత చిరాకో నీకు బాగా తెలుసు!" అన్నాడు హార్వే.

"అలాగే.... బాబాయ్.... కాని...."

కనుబొమ్మలు ముడిచి 'ఏమిటి?' అన్నట్టు చూశాడు హార్వే.

"మొత్తం పని...."

"ఆఁ!"

"పూర్తి.... చెయ్యడం.... క.... కష్టం...." నట్టుతూ తలదించుకొని వాక్యం పూర్తిచేసింది.

హార్వేలో కోపం బస్సున సోడాగ్యాస్‌లా పొంగింది. అయితే ఆ పొంగు బయటపడకుండా జాగ్రత్తపడ్డాడు. కారణం చుట్టూ జనం ఉన్నారు. అది తన క్యాబిన్ కాదు. ఒకసారి సీతకేసి కొరకొర చూసి అక్కడ్నుంచి విసురుగా వెళ్ళిపోయాడు.

సీత గుండెల మీదుగా గాలి పీల్చుకుని వదిలింది రిలీఫ్‌గా.

సీత తనకేబిన్‌లోకి వెళ్ళాలనుకొన్నది. కాని అనుకోకుండానే డెక్‌మీదకు వెళ్ళింది. ఆమె అంతరాంతరాల్లో ఎక్కడో అతను మళ్ళీ తప్పక కన్పిస్తాడనే నమ్మకం ఉంది. ఆ నమ్మకం అతను కలిగించిందే.

తను తల్చుకుంటే వస్తానన్నాడుగా? ఉదయంనుంచి తను అతన్ని తల్చుకొంటూనే ఉన్నది. తన ఆలోచనలు అతని బుర్రకు అందే ఉంటాయి. అతనికి టైలిపతి పవర్ ఉన్నదేమో. అతని మాటల్ని బట్టి తనకు అలాగే అన్పించింది.

కొందరు క్యాబిన్స్‌లోని ఉక్కనుభరించలేక డెక్‌మీద పచార్లు చేస్తున్నారు. మరికొందరు రైలింగ్ దగ్గిర నిలబడి సముద్రపు నురగల్ని చూస్తున్నారు. అందరూ సీతకేసి చూస్తున్నారు. ఆమెకు కొంచెం ఇబ్బందిగా అన్పించి జనం

వేలాది కుటుంబాలు ఆనాదిగా వాడబడుతున్న,
లవంగనూనె ప్రభావాలన్నింటినీ ప్రామిస్‌లో మళ్ళీచూసారు

# లవంగనూనెతో కూడిన
# సాటిలేని టూత్‌పేస్ట్
# ప్రామిస్

మీరూ ఎందుకు వాడి చూడకూడదు మరి!







ప్రామిస్
దంతక్షయంనుండి రక్షణకు
తోడ్పడుతుంది.
నోటిని తాజాగా
రూపొందించి
దుర్వాసనను అరికడుతుంది.



బల్సారా ఉత్పాదన

ఆరోగ్యం చిందే పళ్ళు,
చిగుళ్ళు, తాజాశ్వాస–
అదే మరి ప్రామిస్ వాగ్దానం.

కర్కువ ఉన్న చోటుకు వెళ్లి నిల్చుంది చువ్వలు పట్టుకుని. అక్కడ స్త్రీ పురుషులు చేతులు పట్టుకుని నిల్చుని కబుర్లు చెప్పుకొంటున్నారు. వారు ఈ లోకంలో రు వాళ్లు సీతను గమనించలేదు.

సీత కొంతసేపు నిల్చుని దూరంగా ఖాళీగా ఉన్న ప్రదేశంలో కూర్చుంది. కితంరోజు రాత్రి గురించీ, ఆ అజ్ఞాత వ్యక్తి గురించీ, తన భవిష్యత్తుగురించీ లోచిస్తూ కూర్చుంది

తను ఏఁ పాపం చేసింది? ఏదో చేసే ఉండాలి! అందువల్లనే తల్లి దండ్రులకు దూరం అయింది రాక్షసుడిలాంటి బాబాయి ప్రాకరంలో దుర్భరంగా జీవిస్తోంది.

ఈ జీవితంకంటే తను తన తల్లిదండ్రులతో పాటు చనిపోయివుంటే బాగుండేది. వాళ్ళతోపాటు చర్చియార్డ్‌లో ప్రశాంతంగా దీర్ఘనిద్రలో ఉండి ఉంటే ఈ నరకం తప్పి ఉండేది ఈ భయంకరమైన జీవితాన్ని విరమించుకోవాలనే వచ్చింది. కాని....అతను తనను ఆ పని చెయ్యనివ్వలేదు. పైగా వాగ్దానం చేయించాడు.

క్రిస్టియన్ టీచింగ్స్ ప్రకారం తన తల్లిదండ్రులు మరో ప్రపంచంలో ఈ ప్రపంచాన్ని కొన్నివేల సంవత్సరాలనుంచి వదిలివెళ్లి వాళ్ళ మధ్య హాయిగా ఉండి ఉంటారు.

హాయిగా ఉండి ఉంటారా? తన కష్టాలను చూసి బాధపడుతూ ఉండరా?

ఏమో! ఎవరికి తెలుసు? చనిపోయాక ఏం జరుగుందో ఎవరికీ తెలియదు

అతను వస్తే బాగుండును. వస్తాడు తప్పక.

"హల్లో! ఏం చేస్తున్నారు"?

సీత ఉలిక్కిపడి వెనక్కు చూసింది.

ఆశ్చర్యంగా చూస్తూనే ఉండిపోయింది.

ఇది నిజమా! అతను నిజంగా తన ఆలోచనలు తెలుసుకొని వచ్చాడా? లేక తన భ్రమా?

"ఏమిటలా చూస్తావ్?"

"మీ గురించే ఆలోచిస్తున్నాను. మీరు కన్పిస్తే బాగుండునని ఆలోచిస్తున్నాను. నిజంగానే మీరు వచ్చేశారు." పసి పిల్లలా మాట్లాడుతున్న సీతను అతను చూస్తూ నిల్చున్నాడు. (సశేషం)

# ఆదర్శ పత్ని









# సహవాసం

నేటి ప్రపంచంలో మానవులకు కాలక్షేపం కలిగించేవి చాలా వున్నాయి. సినిమాలు, షికార్లు, క్లబ్బులు, గుర్రప్పందాలు, తాగుడు, జూదం మొదలగు వాటి కొరకు సంపాదన సగానికిపైగా వెచ్చించే వారు చాలామంది వున్నారు.

తమ ఒంటరి తనములో సృష్టికర్తయైన దేవునితో సహవాసించిన వ్యక్తులు, ఆత్మీయంగా ఐహికంగా మేలు పొందగలరు. ఒంటరిగా, ప్రశాంతంగా వున్నప్పుడు చేసే ప్రార్థన, పాడే కీర్తన, వేద పఠన హృదయానికి చెప్పశక్యముగాని మనశ్శాంతిని చేకూర్చగలవు. దేవుని సాంగత్యం కోసం ఎదురుచూచి ఆ సాంగత్యంలో ఆనందించిన వారిని గూర్చి బైబిల్‌లో ఇలా చెప్పబడింది. "దేవుని కొరకు ఎదురు చూచువారు నూతన ఫలము పొందుదురు. వారు పక్షిరాజువలె రెక్కలు చాపి పైకి ఎగురుదురు. అలయక పరుగెత్తుదురు సొమ్మసిల్లక నడచి పోవుదురు." ఆత్మీయంగ ఉన్నత శిఖరాలను తాకాలనుకొన్న భక్తుడు కూడా ఒంటరిగా దేవునికోసం ఎదురుచూడాలి. దేవునితో ఇలా ఒంటరిగా సహవసించాలనే కోరికలో దేవునికోసం సంపూర్ణ సమర్పణ చేయుటకు, స్వంత చిత్తాన్ని గెలుచుటకు ఆత్మీయంగ బలపడుటకు, ఏకాకిగా దైవ సహవాసంలో కాలం గడుపుట భక్తునికి ఎంతైన అవసరం. ఇటులోకం కోసం, అటు దేవునికోసం ఒకేసారి పరుగెత్తటం అసాధ్యం క్రీస్తు ప్రభువు కూడా పగలంతా బోధిస్తూ, రాత్రి అంతా దైవ సన్నిధిలో ప్రార్థిస్తూ లోకములో జీవించాడు. ఆ క్రీస్తుని గూర్చి తెలుసుకొన్నారా?

---

ఉచితం!! ఉచితం!!

---

కరుణామయుడైన యేసుక్రీస్తు జీవిత చరిత్ర, మానవాళికి ఆయన అందించిన కమనీయబోధలు తెలిపేఅందమైన పుస్తకం ఉచితంగా పొందదలచుకుంటే మీ చిరునామా ఈరోజే తెల్పండి. పోస్టు ఖర్చులు మేమే భరించి ఉచితంగా పుస్తకం పంపుతాము.

డా॥ ఎస్. జాన్ డేవిడ్
పోస్టుబాక్సు 14, చిలకలూరిపేట
గుంటూరు జిల్లా.

---

యర్రంశెట్టి శాయి

హ్యూమరాలజీ-5

# మా అనారోగ్యమే మా మహాభాగ్యం



మా కాలనీ వాళ్ళు తరచుగా ఏదొక సందర్భంలో మీటింగ్‌లు పెట్టడం మామూలే అని మీకీపాటికి తెలిసే ఉంటుంది. అందులోనూ శాయిరామ్ ఆర్గనైజింగ్ సెక్రటరీ అయాక పరిస్థితి మరింతవిషమించింది. ఇంచుమించుగా ప్రతాదివారం మీటింగులు పెట్టేస్తున్నాడు. ఆ ఆదివారం మీటింగ్ కాలనీవాసుల ఆరోగ్యం గురించి అని ముందే అందరికీ తెలియజేసేశాడు.

తొమ్మిదింటికల్లా కాలనీవాళ్ళు చాలా మంది మీటింగ్‌కి హాజరయ్యారు. నేనూ అక్కడికి చేరుకునేసరికే శాయిరామ్ మైక్ దగ్గర నిలబడి స్పీచ్ దంచేస్తున్నాడు.

“....మొన్నటికిమొన్న మా రెండో అబ్బాయికి దగ్గుగా ఉందని డాక్టర్ దగ్గరకు తీసుకెళితే ఏదో టాబ్లెట్లు టానిక్ రాసిచ్చి ముప్పై రూపాయలు ఫీజు తీసు




కున్నాడు. ఆ మందులు వాడేసరికి వాడికి దగ్గుపోయి వాంతులు మొదలయినాయ్. మళ్ళీ అదే డాక్టరు దగ్గరకు తీసుకెళితే వాంతులు తగ్గటానికి మళ్ళీ టాబ్లెట్లు రాసిచ్చి ఫీజు ముప్ఫయ్ రూపాయలు తీసుకున్నాడు. దగ్గుకి వాడిన టాబ్లెట్స్ తాలూకూ ప్రభావం వల్ల వాంతులవడం మామూలేనని డాక్టర్ సెలవిచ్చాడు. వాంతులకు మందులు వాడేసరికి–అవితగ్గి, అజీర్ణం మొదలయింది. అది ఆ వాంతుల తాలూకు మందుల ప్రభావమట! మళ్లీ కొత్త మందులూ, మళ్లీ ముప్ఫయ్ రూపాయల ఫీజు.——ఇలా ఎంతకాలం డాక్టర్‌కి ముడుపులు చెల్లిస్తుండాలో అర్థంకాక ఆ విషయం అడిగితే "మీ అనారోగ్యమే మాకు మహాభాగ్యం" అన్నారాయన చిరునవ్వుతో! కనుక సోదరులారా! ఇప్పుడు మనందరం కలిసి ఈ సమస్యకు పరిష్కారం ఆలోచించడానికి ఇక్కడ సమావేశమయ్యాం. ఎందుకంటే ఈ సమస్య నా ఒక్కడిదీ కాదు. మన కాలనీలో అందరూ వందలకు వందలు ప్రతి నెలా డాక్టర్లకు సమర్పించుకుంటున్నాము. రోగాలతో ఓ బాధ–డాక్టర్ల ఫీజులతో మరో

బాధగా ఉంది మనకు. ఈ విషయం మీద సోదర సోదరీమణులంగరూ తమ తమ అభిప్రాయాలు తెలియజేస్తారని ఆశిస్తాను."

వెంటనే రాజేశ్వరమ్మగారులేచి నిలబడింది ఆడాళ్ళ మధ్యలోనుంచి.

"మీరు చెప్పింది నిజమే అన్నయ్యగారూ! మొన్నో డాక్టరు సచ్చినోడు మా చంటిదానికి టి.బి. ఉందని చెప్పి ఇంజక్షన్లు, టాబ్లెట్లు మొదలెట్టేడు. పదిహేను రోజుల తరువాత దాని స్కూలులో డాక్టర్లు ఆరోగ్యం శుభ్రంగావుందని కార్డు పంపించాక అనుమానంవచ్చి వేరే డాక్టర్లతో పరీక్ష చేయిస్తే టి.బి లేదు, గాడిద గుడ్డూలేదని చెప్పేశారు అయితే అనవసరంగా టి.బి. ఇంజెక్షన్లూ, టాబ్లెట్లు వాడడంవలన మరేదో రోగం ముంచుకొచ్చిందనిచెప్పి, అది తగ్గటానికి ఇంకా ఏవో ఇంజక్షన్లు రాసిచ్చారు. దీనికంతా కలిపి వెయ్యి రూపాయలు అప్పయింది! ఆ పాడు సచ్చినోడు అలా అబద్ధాలు చెప్పకుండా ఉంటే ఆ వెయ్యిపెట్టి గ్రైండర్ కొనుక్కునేదాన్ని." అందామె ఆవేశంగా.

అందరూ రాజేశ్వరమ్మగారి చంటిదాని గురించి కొద్దిసేపు సానుభూతితో మాట్లాడుకున్నారు.

ఆ తరువాత కాలనీ ప్రెసిడెంట్ జనార్దన్ మైకు ముందు నిలబడ్డాడు. ఆయన తాలూకు వైద్య నారాయణ్‌గారి అనుభవం ఇలా రసవత్తరంగా సాగింది

"అది 1970వ సంవత్సరం. మా ఆవిడ విపరీతమైనంత కడుపు నొప్పితో బాధ పడుతూ ఉంటే అర్ధరాత్రి మా రైల్వే హాస్పిటల్‌లో డ్యూటీ డాక్టర్ దగ్గరకు తీసుకెళ్ళాను.

"ఇది ఎపెండిసిటిస్! వెంటనే ఆపరేషన్ చేసెయ్యాలి." అనేసి కాగితం మీద రాసిచ్చి, తన ఫీజు యాభైరూ- అర్ధరాత్రి తను నిద్ర పాడయినందుకు మరో పాతిక తీసుకుని అర్జంటుగా మమ్మల్ని బయటకుపంపి తలుపేసుకుంది. మా ఆవిడను మర్నాడు పొద్దున్నే ప్రైవేట్ నర్సింగ్ హోంకి తీసుకెళ్ళి ఎపెండిసిటిస్ ఆపరేషన్ చేయమంటే వాళ్ళు గంటసేపు ఆపరేషన్ చేసి అది ఎపెండిసిటిస్ కాదని, అంచేత ఆపరేషన్ కాన్సిల్ చేసేస్తున్నామని తేల్చారు.

ఆ నర్సింగ్ హోమ్ ఇన్‌చార్జ్ నన్నుచూసి మండిపడింది.

"ఇది ఎపెండిసిటిస్ అని ఎవరు చెప్పారు మీకు?"

"మా రైల్వే హాస్పిటల్‌లో ఫలానా డాక్టరండీ!"

"వాడికేమయినా బుద్ధుందా?"

"ఉందనుకునే మా రైల్వేవాళ్ళు మా




రైల్వే హాస్పిటల్‌లో ఉద్యోగం ఇచ్చారండీ:"

"ఆవిడకు బుద్ధిలేదు అని నేను చెప్తున్నాను." అందావిడ కోపంగా.

"సరేనండీ:"

"ఉంటే కడుపునొప్పి అన్నంత మాత్రాన ఎపెండిసిటిస్ అని రాసేస్తారు"

"మా రైల్వేలో రాసేస్తారండీ" అన్నాను నిజం ఒప్పుకుంటూ.

"టు హెల్ విత్ యువర్ రైల్వే అండ్ - టు హెల్ విత్ యువర్ లేడీ డాక్టర్"

"అలాగేనండి"

"సరే ఎపెండిసిటిస్ అయితే మరి ఆవిడ మీ రైల్వే హాస్పిటల్‌లోనే ఏందుకు ఆపరేషన్ చేయలేదు?"

"చేస్తాననే అందండీ ఆవిడా కానీ నేను ఒప్పుకోలేదు"

"ఎందుకని ఒప్పుకోలేదు-"

"మా ఆవిడ నేనూ ప్రేమించి పెళ్ళి చేసుకున్నామండి పైగా ఇప్పటికి ఇలాంటి తగువులుగాని, విభేదాలు గాని, కక్షలుగాని మామధ్య లేవు. అంచేత ఇంకొంత కాలమయినా సుఖంగా సంసారం చేయాలన్న ఆశతో మా హాస్పిటల్‌లో ఆపరేషన్‌కు నేను అభ్యంతరం చెప్పి మీ ప్రైవేట్ నర్సింగ్ హోమ్‌కి తీసుకొచ్చానండీ"

"మరి సంగతులన్నీ ముందే చెప్తే, నేను మళ్ళీ పరీక్షించి అది ఎపెండిసిటిస్ అవునా కాదా అని తేల్చి అప్పుడు ప్రారంభించేదానినికదా!"

"మా లేడీ డాక్టరు ..."

"టు హెల్ విత్ యువర్ లేడీ డాక్టర్ ...."

"ఆవిడకూడా యం. బి. బి. యస్ డిగ్రీ ఉంది. ఆవిడా చాలా రోజుల్నుంచీ రోగులకు మందులిస్తోంది కదా అని ఆలోచించి-"

"అ ఆ లు రానివాళ్ళుకూడా మన దేశంలో లక్షలమందికి డాక్టర్లుగా మందులిస్తున్నారని పేపర్లో చదవ లేదూ!"

"చదివానండీ!"

"మరి మందులివ్వడం పెద్ద ఘన కార్యంలా మాట్లాడుతారేమిటీ?"

"ఇంతకూ మా ఆవిడకున్న జబ్బేమిటండీ? ఆ కడుపునొప్పి ఎందు

కొచ్చింది?"

"అది ఎమిబియాసిస్-"

"ఎమిబియాసిసా్సండీ!"

"అవును?"

"అంటె ఏమిటండీ?"

"మీరు ఏ డిపార్టుమెంటులో పని చేస్తున్నారు?"

"రైల్వేలో-"

"అందుకే ఇలా మా టైమ్ వేస్ట్ చేస్తున్నారు. ఎమిబియాసిస్ అంటే ఏమిటో మీకు వివరంగా చెప్పాలంటే నాలుగ్గంటలు పడుతుంది నాలుగ్గంటలు అంటే రెండు ఆపరేషన్లు. రెండు ఆపరేషన్లంటే వెయ్యిరూపాయలు అర్థమయ్యిందా?"

"అయ్యిందండీ!"

"అయితే నాలుగొందలు ఫీజుకట్టి ఈ మందులు కొని వాడండి.

"నాలుగొందలు ఎందుకండీ? ఆపరేషన్ చెయ్యలేదుగా?"

"చెయ్యకపోయిన చేసినంత పనయింది కదా-పేషంట్‌కి కంప్లీట్ రెస్ట్-పంచదార లేకుండ పాలు ఇవ్వండి-వారం రోజుల వరకూ పళ్ళు, కూరగాయలు వాడొద్దు-ఈ మందు రోజుకి మూడుసార్లు-వారం రోజులు ఇంజెక్షన్లు-ఫీజివ్వండి త్వరగా!" ఫీజిచ్చి బయట పడ్డాను.

మందులన్నీ వాడినా కడుపునొప్పి తగ్గక పోయేసరికి డాక్టర్ని మార్చక తప్ప లేదు. కొత్త డాక్టరు అన్ని పేపర్లు చూసి, అన్ని వివరాలూ అడిగి తెలుసుకుని అరగంటసేపు ఆలోచించాడు. అతను ఆలోచిస్తున్నకొద్దీ నాకు భయం ఎక్కువయిపోసాగింది.

"రేపురండి! చెప్తాను." అన్నాడు సీరియస్‌గా.

"అంటే-ఇదేం ప్రమాదకరమయినది కాదు గదా?" అనుమానంగా అడిగాను.

"ఆ విషయంకూడా రేపే తెలుస్తుంది."

"ఇప్పుడు చెప్పడం కుదరందా?"

"కుదరదు!"

"ఎందుకని?"

"నిజం చెప్పమంటారా?"

నాకు చెమటలు పట్టేసినయ్. మా ఆవిడ మొఖం పాలిపోయింది, ఇద్దరికీ ఏడుపొక్కటే తక్కువ. తప్పకుండా అది ప్రాణాలు తీసే జబ్బే అయుంటుంది.

"చెప్పండి నిజం చెప్పేయండీ-" అన్నాను వణుకుతూ.

"నేను ఎం. బి. యస్ పరీక్షలన్నీ కేవలం ఆరు జబ్బులకు సంబంధించిన పాఠాలే చదివి పాసయ్యాను. ఆ జబ్బులే పరీక్షలో అడుగుతారని మా మామయ్య చెప్పాడు. ఆయన ఇదివరకు హేల్త్ మినిస్టరులెండి అందుకని మిగతా జబ్బులన్నీ వదిలేశాను.

అంచేత ప్రస్తుతం ఆ దజను జబ్బుల్లో- ఇరుకున్న పేషంట్ వస్తేనే వైద్యం చేయగలను. మిగతా జబ్బులయితే ఇ టికెళ్ళి రాత్రంతా గైడ్ చదివి పొద్దున వైద్యం చేస్తాను. కనుక మీరు రేపొద్దున్న రండి ప్రస్తుతానికి ఇదంతా చెప్పినందుకు పాతిక రూపాయల ఫీజివ్వండి చాలు" అన్నాడు. నేను పాతిక రూపాయలు అతనిచేతిలో పెట్టి బ్రతుకుజీవుడా అని బయటపడ్డాను. మరోడాక్టర్ మా ఆవిడను పరీక్షించి," ఖచ్చితంగా ఇది గాస్ట్రిక్ ట్రబులే" అన్నాడు ధీమగా.

"అంటే ఏ టండి?

"అంటే పెప్టిక్ అల్సర్ అంటే గాస్ట్రిక్ యాసిడ్ వల్ల అల్సర్ ఫాం అవుతుందన్నమాట, అంటే వీటివల్లే కడుపు మంటలు వగైరాలొస్తాయన్న మాట అంటే - అంతే- ఇంకేమీ లేదు"

"మరి దీనికేం చేయాలంటారు?"

"ముప్ఫయ్ రూపాయలు నాకు ఫీజివ్వాలి ఇస్తే మందులు రాస్తాను."

"ఫీజు ఇస్తాన్లెండి-ఇవ్వకుండా పారిపోను గదా"

"అలా అన్జెప్పి-మీ ప్రైవేట్ డ్రైవర్ ఒకతను మందులు రాసేశాక ఫీజవ్వకుండా మందుల కాగితం తీసుకొని ఏక్స్ప్రెస్‌లాగ పారిపోయాడు. అప్పటి నుంచీ నేను ఫీజు ముందు తీసుకొని తరువాత ట్రీట్‌మెంట్ ఇస్తాను-ఏదీ-ఫీజివ్వండి"

నేను ఫీజిచ్చాక అతను మందులు రాసిచ్చాడు.

"చూడమ్మా నువ్వు పూర్తిగా విశ్రాంతి తీసుకోవాలి" అన్నాడు మా ఆవిడతో.

"అలాగేనండీ"

"సాధారణంగా నువ్వేం ఆలోచిస్తుంటావ్?"

"అవీ-ఇవీ- ఆలోచిస్తుంటానండీ"

"అవీ-ఇవీ-అంటే ఏమిటి?"

"అంటే, ఆదివరకూ ఎక్కువగా కాలనీలో ఇరుగు పొరుగువాళ్ళు ఏమయినా కొత్త వస్తువులుగానీ, చీరెలుగానీ, కొంటే వాటిగురించే ఆలోచించేదాన్నండీ "కానీ ప్రస్తుతం ఆ ఆలోచనలు పోయాయండీ"

"మరిప్పుడు ఏ విషయం ఎక్కువగా ఆలోచిస్తూంటారు?"

"ఇప్పుడు మా అన్నగురించి ఆలోచిస్తూంటానండీ!"

"ఎందుకు మీఅన్నగురించి ఆలోచించటం?"

"పాపం మా అన్న రాత్రింబగళ్లు శ్రమపడుతున్నాడు కదండీ! అందుకని చాలా ఆవేదనగా ఉంటుందండీ!"

"చూడమ్మా! మగాడన్నాక శ్రమపడక తప్పదు కదా! దాన్ని గురించి ఆలోచిస్తూంటారా? ఇంతకీ మీ

# తెలుగునాట వెలుగుబాట

తెలుగునాట ఒకనాడు పాడి పంటలు వెల్లి విరిసాయి. పాలు, తేనెలు. ప్రవహించాయి, సిరిసంపదలు విలసిల్లాయి. లలిత కళలు నాట్యమాడాయి. పౌరుషం ప్రజ్వరిల్లింది. శాతవాహన, ఇక్ష్వాక, కాకతీయ, విజయనగర సామ్రాజ్యాల కాలంతో తెలుగు తేజం దిగంతాల వెలుగొందింది. అనంత కీర్తిని ఆర్జించింది. ఆనాటి సిరిసంపదలను తిరిగి సాధించి, ప్రజా జీవితాన్ని సౌభాగ్యవంతం చేసి ఆనాటి పౌరుషాన్ని, కళా ప్రాభవాన్ని పునఃప్రతిష్టించి తెలుగుజాతికి చిరకీర్తిని చేకూర్చాలన్నదే శ్రీ యన్. టి. రామారావు నాయకత్వాన గల రాష్ట్ర ప్రభుత్వ ప్రగాఢ ఆకాంక్ష. ఆ లక్ష్య సాధనకోసం క్రొత్త ప్రభుత్వం మూడు నెలల స్వల్ప కాలంలోనే ఎన్నో సాహసోపేతమైన నిర్ణయాలు గైకొన్నది.

★ దేశానికి అన్నం పెట్టే రైతన్నను ఆదుకోడానికి ఆత్మతతో ముందుకు వచ్చింది. ధాన్యానికి క్వింటలుకు 20 రూపాయల చొప్పున సబ్సిడి ప్రకటించి రైతన్న వెన్ను తట్టింది.

★ పేదలకు రెండు రూపాయలకే బియ్యం సరఫరా చేసే బృహత్ పథకాన్ని నేటి ఉగాది నుంచే అమలు జరుపుతున్నది.

★ బలహీన వర్గాలకోసం 2 లక్షల 20 వేల యిళ్లు నిర్మించనున్నది.

★ ఆడపడుచులకు తండ్రి ఆస్తిలో సమాన ఆస్తి హక్కు కల్పించాలని కేంద్రాన్ని కోరుతూ విధానమండలిలో తీర్మానాలు ఆమోదింపచేసింది.

★ మహిళలకోసం తిరుపతిలో వచ్చే విద్యా సంవత్సరంనుంచి ప్రత్యేక విశ్వ విద్యాలయం ఆరంభించనున్నది.

★ 62 లక్షల మంది బాలబాలికలకు మధ్యాహ్న భోజనంకోసం సమగ్రపథకం ప్రవేశ పెట్టింది.

★ విధాన పరిషత్తును రద్దు చేయడానికి, పార్టీ ఫిరాయింపులను నిరోధించడానికి, మాజీ శాసనసభ్యుల పింఛనులకు స్వస్తి పలకటానికి విధాన సభలో తీర్మానాలు చేయించింది.

★ ఉద్యోగావకాశాలను పెంచి నిరుద్యోగ యువకుల నైరాశ్యాన్ని పారద్రోలే సంకల్పంతో ప్రస్తుతోద్యోగుల పదవీ విరమణ వయస్సును 58 నుంచి 55 సంవత్సరాలకు తగ్గించింది.

★ వివిధ కార్పొరేషన్ల సంఖ్య తగ్గింపు ద్వారా 4 కోట్ల రూపాయల పైగా వ్యయాన్ని ఆదా చేయనున్నది

★ ప్రభుత్వ వ్యవస్థలో అవినీతి నిర్మూలన కోసం ధర్మ మహామాత్రను ఏర్పాటు చేసింది.

★ సచివాలయ స్థాయిలో తెలుగును అధికార భాష చేసే కార్యక్రమం ఈ ఉగాదినుంచే ప్రారంభమవుతున్నది.

ప్రజా సౌభాగ్యం కోసం, వివిధ రంగాలలో రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధి కోసం ప్రభుత్వం 15 అంశాల కార్యక్రమాన్ని రూపొందించింది. మంచినీటి సరఫరా, బలహీన వర్గాల సంక్షేమం, పేదలకు గృహవసతి, గ్రామీణ విద్యుదీకరణ, భూసంస్కరణల అమలు వంటి అభ్యుదయ కార్యక్రమాల అమలుకు ఈ 15 అంశాల కార్యక్రమం పునాది అవుతుంది.

తెలుగు ప్రజల ఆకాంక్షలు నెరవేర్చటానికి అంకితమైన ప్రభుత్వ కృషికి, కార్యదీక్షకు ఇది నిదర్శనం.

డైరెక్టరు

సమాచార, పౌర సంబంధశాఖ.

లెటర్ నం. 25514. అడ్వర్టయిజ్‌మెంట్ సి13/83, ది. 8-4-1983

అన్నయ్య ఏమి పనిచేస్తారు ?"

"మన రాష్ట్రానికి ముఖ్యమంత్రి కదండీ! మీకు తెలీదూ !"

"అంటే నువ్వు మాట్లాడేది యన్. టి. ఆర్. గురించా ?"

"అవునండీ! ఆయన్ని కదండీ 'అన్న' అంటే ?"

"చూడమ్మా! ప్రస్తుతం నువ్వు ఏ ఆలోచనలూ లేకుండా ప్రశాంతంగా గడపాలి! అప్పుడే అల్సర్ నయమవుతుంది-"

"అన్న మా స్త్రీల మంచికోసం ఇంత పాటుపడుతూంటే ఆలోచించకుండా ఎలా ఉండగలనండీ"!

"ఉండాలమ్మా తప్పదు-"

మా ఆవిడ అయిష్టంగానే అంగీకరించింది.

అల్సర్‌కి కొన్నిరోజులు ట్రీట్‌మెంట్ అయాక మరో కొత్త డాక్టర్‌ని చూడక తప్పలేదు.

ఆయన అంతవరకూ డాక్టర్లురాసిన, చేసిన పనులన్నీ చదివాడు. ఎక్స్‌రేలు చూశాడు-

"అసలు ముందిది ఎపెండిసిటిస్ అని రాసిన లేడీ డాక్టర్‌కి బుర్రలేదు-" అన్నాడు అన్నీ చదివాక.

"అవునండీ! ఆ విషయం రెండో డాక్టర్ చెప్పారు-"

"నన్నడిగితే ఆ రెండో డాక్టర్‌కీ బుద్ధిలేదు-"

"పోనీ మూడో డాక్టర్ కండీ?"

"మూడో డాక్టర్‌కీ అంతకన్నా లేదు-"

"లేదాండీ?"

"ఏ మాత్రం లేదు- ఇలాంటి బుద్ధి తక్కువవాళ్ళ దగ్గర కెందుకెళ్ళారు మీరు?"

"ఆ సంగతి వాళ్లు చెప్పలేదు కదండీ ముందు- అందుకని-"

"నన్నడిగితే అసలు మీకూ బుద్ధిలేదంటాను."

నాకోకోపం వచ్చింది.

"మీక్కావాలంటే ఇంకో అయిదు రూపాయలు ఎక్కువ ఫీజుతీసుకోండి అంతేగాని ఇలా తిట్టటానికి వీల్లేదు."

"లేకపోతే ఏమిటయ్యా మీఆవిడ ఆ కొత్త ఆవకాయపచ్చడి పూటకి నాలుగు బద్దల చొప్పున వేసుకుని మింగుతోంటే కడుపు నొప్పి రాకేం చేస్తుంది. ఈ మాత్రానికో ఆపరేషనూ పాతిక రకాల మందులూ, ఇంజక్షన్లూ, అరడజను డాక్టర్లూ- ఏమిటీ నాన్సెన్స్? నా ఫీజిచ్చి ఒక ఇంటికి పొండి మీ ఆవిడకు వారంరోజులవరకూ కేవలం మజ్జిగన్నంతినిపించండి అంతే దెబ్బకు ఎగిరిపోతుంది కడుపు నొప్పి-"

చివరకు ఆ విధంగా రెండువేల రూపాయల ఖర్చు తరువాత కేవలం మజ్జిగన్నంతో కడుపునొప్పి మాయమయిపోయింది, కనుక సోదర సోదరీ

మణులందరూ నా అనుభవాన్ని బట్టి ఆలోచిస్తే "మీ అనారోగ్యమే - మా మహాభాగ్యము" అనేది డాక్టర్ల పాల సీగా కనబడతుందని ఇట్టె తెలిసిపో తుంది. ఇప్పుడు నా సలహా ఏమి టంటే మని కాలనీ వాళ్ళందరం కలసి బాగా పేరు అనుభవం, నైపుణ్యం వగయిరాలన్నీ గల డాక్టర్ని మన కాలనీకోసం మనమే ఏర్పాటు చేసు కుంటే అందుకీ బోలెడు ఫీజులు కట్టే పరిస్థితి తప్పడమే కాకుండా, సరయిన వ్యాధి నిర్ణయం, తగిన వైద్యం జరిగే అవకాశం ఉందని మనవిచేస్తున్నాను" అంటూ ముగించాడతను. అందరూ ఆ సలహా అద్భుతంగా ఉందని తప్పట్లు కొట్టారు.

గోపాలరావ్ లేచి నిలబడ్డాడు.

"ఎలాగూ యాభయ్ అయిదేళ్ల స్కీములో చాలామంది డాక్టర్లు రిటైర్ అయారు. కనుక వాళ్లలో ఓ మాంఛి డక్టర్ని మన కాలనీకోసం ప్రత్యే కంగా నియమిస్తే బాగుంటుంది"

"అవునవును" అన్నాడు రామా చారి.

"మరి ఆ డాక్టర్కి జీతాం ఎవరి స్తారు ?" రామచంద్రరావు లేచి పొట్ట నిమురుకుంటూ అడిగాడు.

"ఎవరేమిటి మనందరం. కాలనీలో ఇంటికి అయిదు రూపాయల చొప్పున వసూలుచేస్తే- డాక్టర్కి నెలకి పన్నెం డొందల జీతం ఇవ్వవచ్చు"

ఆ సూచనకు అంతా హర్షధ్వాలు చేసారు.

"నిజంగా ఆ గోపాలావ్ది చాలా తెలివిగల బుర్ర" అని ఒకావిడ గట్టి గానే అనడం వినిపించి గోపాలావ్ మరింత గర్వంగా అందరివేపూ మెరు స్తూన్న కళ్ళతో చూడసాగాడు.

"నన్నడిగితే ఆ డబ్బు డాక్టర్ కిచ్చే బదులు- ఇంకేదయినా ఉపయోగ కరమయిన కార్యక్రమానికి ఖర్చుచేయ డం మంచిది అసలు మనదేశంలో డాక్టర్లే ఓ పెద్ద లగ్జరీ దానికి తోడు జీతాలు ఇవ్వడం కూడానా?" అన్నాడు రామచంద్రం.

అంతా రామచంద్రాన్ని అర్థంటుగా కూర్చోమని కేకలు వేశారు.

"నీకేం నాయనా శనివారంనాడు కూడా వదలకుండా కోడికూర తింటావ్ తాతలు సంపాదించిన ఆస్తి ఉంది. ఇక రోగమా, రొష్టా- డాక్టర్లతో పనేముం టుంది నీకు." అంది రాజేశ్వరి సాగ దీస్తూ.

"సరే మీ ఇష్టం, తరువాత మీరే ఘోరున ఏడుస్తారు!" అనేసి పొట్ట నిమురుకుంటూ కూర్చున్నాడు రామ చంద్రం.

రెండురోజులపాటు వెతికి వెతికి చివరకు రిటైరయిన చాకులాంటి డాక్టర్ని నెలకి పన్నెండొందల జీతానికి మాట్లాడి తీసుకొచ్చారు జనార్ధనూ, శాయిరామ్ కలసి. ఆయన కాలనీకి రావడమే అందరి ఇళ్ళూ చెక్ చేశాడు. ఆ తరువాత మీటింగ్ ప్రారంభమయింది.

"కాలనీ అంతా చూశాక నాకు చాలా లోపాలు కనిపించాయి చదువుకున్నవారయినా కూడా ఎవ్వరూ నీళ్ళు కాచి తాగడం లేదు. మనిషికొచ్చే జబ్బులలో నూటికి తొంభయిఎనిమిది కేవలం నీళ్ళుకాయకుండా తాగడం వల్లేవస్తాయ్ కనుక రేపటినుంచి అందరూ నీళ్ళు కాచితాగుతారని ఆశిస్తాను. నేను చిన్నప్పటినుంచీ కాచిన నీళ్ళేతాగడం అలవాటు చేసుకున్నాను ఫలితం ఏమిటో తెలుసా? ఈ రోజువరకూ నాకు జలుబు కూడా చేయలేదు-"

అంతా తప్పట్లు కొట్టారు.

మర్నాటినుంచీ నీళ్ళుకాచి తాగే కార్యక్రమం మొదలయింది. అయితే తాగేప్పుడు కొందరు కళ్ళుమూసుకుని తాగుతే కొంతమంది వాంతి కాకుండా పచ్చడి పక్కనపెట్టుకుని మరీతాగుతున్నారు.

ఆ తరువాత వారం అందరికీ మెడికల్ చెకప్‌చేసే కార్యక్రమం జరిగింది. మళ్ళీ సమావేశం ఏర్పాటు చేశాడు శాయిరామ్.

డాక్టరుగారు మైక్‌దగ్గరకొచ్చి ఉపన్యాసం ప్రారంభించారు.

"అందరినీ చెకప్ చేశాక నేను కొన్ని ఘోరమయిన లోపాలు కనుక్కున్నాను మీలో చాలామందికి ఆరోగ్యానికి సంబంధించిన చిన్నవిషయాలు కూడా తెలీదు ఉదాహరణకి ఆహారపుటలవాట్లు చాలామంది పాలకూర తింటున్నారు, పాలకూర ఆరోగ్యానికి చాలా హానికరం కిడ్నీలోరాళ్ళు ఏర్పడతాయ్ అదితింటే-"

ఆ మాటతో అందరిలోనూ కలవరం బయల్దేరింది.

కొద్దిరోజులక్రితమే మాకాలనీలో రమణారావ్ అనే అతని కిడ్నీలో రాళ్ళుండడంవల్ల ఆపరేషన్ జరగడం, ప్రభుత్వఆస్పత్రి డాక్టర్లు రాళ్ళతోపాటు పొరబాటున కిడ్నీకూడా తీసేయడం- అతను అర్జంటుగా పైకెళ్ళిపోవడం జరిగింది,

"అదేమిటి డాక్టరుగారూ ఆకుకూరలు విరివిగా వాడాలని టి. వి. లో ఆవిడెవరో మరీ మరీ చెప్పిందిగా" అంది జయప్రదాదేవి ఆందోళనగా

"అవును రేడియోలోకూడాచెప్పారు" అంది ప్రభావతి,




“ఆ పత్రికలు, టి.వీలు, రేడియోలు ఏం చెప్పాయన్నది కాదు నాక్కావలసింది నేను ఒక బాధ్యతాయుతమైన డాక్టర్ గా చెప్పేదేమిటంటే మీరెవరూ పాలకూర తినకూడదు. అది చిన్నప్పటి నుంచి తినక పోబట్టే నేను ఎలాంటి జబ్బులేకుండా ఆరోగ్యంగ ఉన్నాను”

అంతా నిశ్శబ్దం అయిపోయారు.

“అంతేకాదు. ప్రతివారూ రోజూ టమాటోలు వాడుతున్నట్లుగా కూడా నాకు తెలిసింది. అవి కూడా కిడ్నీల ఆరోగ్యానికి అంత మంచిది కాదు. కనుక దాని వాడకం కూడా వెంటనే తగ్గించండి-”

ఈసారి హాహాకారాలు పెద్ద ఎత్తున చెలరేగాయ్.

‘నేను నమ్మను’ అన్నాడు గోపాలావ్.

“ఈ విషయం ఇంతవరకూ ఏ డాక్టరూ చెప్పలేదేం? అరిచాడు” శ్రీనివాసరావ్.

“ష్” అరిచాడు డాక్టర్.

“అలా గట్టిగా అరవకండి. గట్టిగా అరవడం, అరుపులు వినడం కూడా మన ఆరోగ్యానికి మంచిది కాదు ప్రతిమనిషికి యాభయ్ డెసిబుల్స్ కంటె ఎక్కువ శబ్దాలు చేరకూడదు-”

అంతా నిశ్శబ్దం అయిపోయారు,

అంతా భయం భయంగా ఎవరి ఇళ్ళకు వాళ్లు బయల్దేరారు. ఆరోజు నుంచి పాలకూర టమాటోలు కాలనీ కెదురుగా ఉన్న కూరగాయల షాపుల్లో కనిపించడం మానేసినయ్.

వారం రోజులయినా గడవకముందే డాక్టర్ గారు అత్యవసర సమావేశం ఏర్పాటు చేశారు ఓ సాయంత్రం.

టిక్కు టిక్కుమంటూ వెళ్ళారందరూ

ఆయన చేతిలో ఏవో సైన్స్ కి సంబంధించిన పుస్తకాలున్నాయ్.

“మీరు నాకు పన్నెండు వందల జీతం ఇస్తున్నప్పుడు- ఆ జీతం విలువకు సరిపడే సేవ మీకు చేయాలి. తప్పదు. అందుకే అన్ని సైన్స్ పీరియాడికల్స్ ఫాలో అవుతున్నాను. ఈ మధ్యనే వెలికి తీయబడ్డా కొన్ని నిజాలు తెలుసుకోండి,

వంకాయలు ఎక్కువ తింటే ఆస్తమా వస్తుంది.

నూనెలో వేయించిన పదార్థాలు ఎక్కువగా తింటే కాన్సర్ వస్తుంది

ఉప్పూ, కారం, పులుపూ ఎక్కువ తింటే అల్సర్ వస్తుంది.

కనుక ఈ రోజునుంచీ అందరూ ఈ నియమాలు పాటించి కాన్సర్ నుంచి రక్షణ పొందుతారని ఆశిస్తాను. నేను ఇవన్నీ చిన్నప్పటినుంచి ఫాలో అవబట్టే ఇంతవరకూ ఏలాంటి అల్సరూ, కేన్సరూ లేకుండా సుఖంగా ఉన్నాను."

సమావేశం ముగిసింది

అందరూ బరువెక్కిన హృదయాలతో ఇళ్ళు చేరుకున్నారు,

ఆ తరువాత రెండువారాల పాటు డాక్టరుగారు అందరికీ లేటెస్టు సర్కులర్లు బుటిన్స్ పంపించసాగారు

1. ఉల్లిపాయలు వాడడం వల్ల గుండె జబ్బులు వచ్చును.

2. బీరకాయలు తినడంవల్ల లోబ్లడ్ ప్రెషర్ వచ్చును,

3 మాంసం చేపలు తినడంవల పక్షవాతం తప్పదు.

4. కోడిగుడ్లు, గట్టిపెరుగు తినడం వల్ల హార్టుఎటాక్ కేరింతలు కొడుతూ వస్తుంది.

5. దుంపకూరలు లివర్ కి సంబంధించిన వ్యాధుల్ని ప్రోత్సహించును.

ఆ తరువాత రెండువారాలు కాలనీ అంతా గగ్గోలెత్తి పోయింది అందరూ కూరలు పూర్తిగా వాడడం మానేశారు. ఏ కూరవండినా ఎవరొకళ్లు ఏదొక జబ్బు పేరుచెప్పడంతో వెవ్వున కేకవేసి కూరగాయలు పడేయటం జరుగుతుంది. కొంతమంది అన్నం తినడం మానేసి గంజి తాగటం మొదలపెట్టారు. మరి కొంతమంది కేవలం పాలు త్రాగి బ్రతుకుతున్నారు. ఇంకొంతమంది ఉప్పు కారం లేని పప్పు మాత్రమే వాడసాగారు.

పిల్లలందరూ తినుబండారాల కోసం ఏడుపులు, పెడ బొబ్బలు, పెద్దాళ్లు అంతకాలంగా అలవాటైన కాఫీలు, టీలు మానలేక కిసురుకోడాలు, విసుక్కోడాలూ, భార్యభర్తలు ఊరికూరికే దెబ్బలాటలు - నానారభసగాను తయారయింది.

ఈ ఆరోగ్యనిబంధనలేమీ పట్టించుకోకుండా అన్ని కూరగాయలూ, అన్నిరకాల నాన్‌వెజిటెరియన్ పదార్థాలు - శుభ్రంగా తిని సుఖంగా తిరుగుతోన్న జీవి ఒక్కడే కనబడ్డాడు నాకు. ఆ తను రామచంద్రం.

ఈ పరిస్థితి చాలా దారుణంగా కనిపించింది నాకు గోపాలరావ్, నేనూ కాలనీ ప్రెసిడెంటు జనార్ధన్; శాయిరాం కలిసి డాక్టరుగారిని కలుసుకుని మా బాధలన్నీ వివరించి ఆయన విధించిన నిబంధనలు పునఃపరిశీలించమనికోరాము.

"నోనోనో- నాటెటాల్! ఆరోగ్య సూత్రాలన్నీ అమలు పరిచం కష్టం గానే ఉంటాయ్ నన్ను చూడండి ఆరోగ్య సూత్రాలు పాటించడం వల్లే యాభై అయిదేళ్ల ఎలాంటి రోగం, ఆఖరికి జలుబు కూడా లేకుండా గడపగలిగాను. అంతేకాదు. మరో యాభయ్ ఏళ్లు కూడా ఇలాగే ఆరోగ్యంగా గడిపేయగలను మీకు నాలాంటి ఉక్కు-ఆరోగ్యం కావాలో లేక ఈ రోగాలని కలిగించే ఆహారపదార్థాలు కావాలో-ఎన్నుకోండి" అన్నాడాయన.

చేసేది లేక తిరిగి వచ్చాము.

అయితే ఆ గొడవ అక్కడితో ఆగలేదు. కాలనీలోని ఆడాళ్లందరూ కూడపలుక్కుని డాక్టరుగారి సలహాలన్నిటికి తిలోదకాలివ్వాలని నిశ్చయించారు చేసేదిలేక మళ్లీ కాలని మీటింగ్ ఏర్పాటుచేసి దానికి డాక్టరుగారిని ఆహ్వానించాము.

"డాక్టరుగారొచ్చాక మనందరం ఇంత కఠిన మయిన నిబంధనలు పాటించడానికి సిద్ధంగాలేమని తెలియజేస్తాం" అంది రాజేశ్వరి.

"అవును ఉప్పు, కారం, కాయగూరలులేని భోజనం తినడం మావల్ల కాదు" అంది పద్మావతిగారు.

"ఎప్పుడో ఏవో జబ్బులొస్తాయని జీవితమంతా ఇలాంటి రుచీ పచీలేని ఆహారం తినమంటే ఎలా?" అంది జయప్రదాదేవి.

శాయిరాం మైకు ముందుకొచ్చాడు.

"అలా తొందర పడకండి డాక్టరుగారు ఇవన్నీ చిన్నప్పట్నుంచి ఆచరించబట్టే అంత ఆరోగ్యంగా ఉన్నారన్న విషయం మనం ఇప్పుడు గుర్తుంచుకోవాలి. కనుక మనకి కూడా అంతమంచి ఆరోగ్యం కావాలంటే అవన్నీ అవలంబించక తప్పదు మరి"

ఈ లోగా డాక్టరు గారి ప్యూన్ హడావుడిగా సైకిల్ మీదవచ్చాడిక్కడికి.

వాడితో జనార్దను శాయిరాం కలిసి చాలాసేపు ఏదో విషయం మాట్లాడి మైకు దగ్గరకొచ్చారు మళ్లీ.

"సోదరు సోదరీమణులారా, మీకీ దుర్వార్త తెలియచేయడానికి ఎంతో విచారిస్తున్నాను. మన కాలనీ డాక్టరుగారు ఇవాళ మధ్యాహ్నం పౌష్టికాహార లోపం వల్ల, హఠాత్తుగా కొలాప్స్ అయి శాశ్వతంగా మనల్ని వదలి పోయారట కనుక మనమందరం ఓ నిముషంపాటు లేచి నిలబడి ఆయన ఆత్మకు శాంతి కలగటం కోసం మౌనం పాటిద్దాము-"

అంతా లేచి మౌనం పాటించారు ఎంతో శ్రద్ధతో.

ఆ తరువాత పెద్ద ఎత్తున కోలాహలం చెలరేగింది.

"ఇంకా నయం- ఇంకొన్నాళ్లు ఆయన చెప్పినట్లు చేస్తే మనమూ అలాగే ఎగిరి పోయేవాళ్ళం-"

అంటోందొకావిడ. 

# కల్లోల గౌతమి

## లల్లాదేవి

(జరిగిన కథ)

---

(శ్రీ గిరి ప్రాంత నివాసి, యక్షిణీల ఇంటి ఆడపడుచు తుల్యభాగ అడవి, పచ్చిక మైదానం దాటి కొండకోనలో పులితో భీకరంగా తలపడింది వేటకోసం వెళ్ళి- పులిని చంపి పులికూనలతో ఇంటికి బయలుదేరింది. )

---

( జరగవలసింది )

వయసు మీరిన వారంతా విందారగించిన తక్షణమే నిద్రా ముద్రితులయినారు అందునించి ఆ చోటు విడిచి తమతమ ఆవాసాలయిన వలయాకారపు గృహ అంతర్భాగాలకు వెళ్ళినారు.

మిగిలి ఉన్న యువతీ యువకులు ఉత్సాహంగా పగలంతా తాము నిర్వర్తించిన కార్యక్రమాల గురించి చెప్పుకున్నారు. మరునాడు చేయవలసిన పనులను గురించి చర్చించారు.

అందరూ తలకొక సంగతి చెప్తూవుండగా ఎవరో అన్నారు.

"తుల్యభాగ ఇంకా తిరిగి రాలేదేమి?" అని అంతటితో ఆ పూట వారి మధ్య నడుస్తున్న చర్చనీయాంశాలన్నీ ముగించబడినాయి. తుల్యభాగ ఎందుకు తిరిగి రాలేదన్న విషయమే ప్రధానాంశమయిపోయింది,

"అడవిదారులవెంట వెళ్ళిరానంత దూరం వెళ్ళి ఎక్కడయినా దారి తప్పిందేమో!" అన్నాడో యువకుడు.

వెంటనే మరొక యువతి ఆ మాటను ఆటకాయించింది.

"సిగ్గు సిగ్గు. నీవు అన్న మాటలు పౌత్తరాహికుల బుద్ధిలా పక్షపాతం హించినాయి తుల్యభాగ దారి తప్పటం ఏమిటి? ఆమె సముద్రాన్ని అయినా అవలీలగా దాటి నాగలోక (సింహళం) మయినా వెళ్ళి తిరిగి రాగలదు "

"నీవు పురుషాధిక్య బుద్ధితో ఆలోచించి ఆడదానిని అవమానం చేయకు. ఈ అడవిలో తుల్యభాగ ఎరుగని ఇరుకుదారు ల్లేవు. ఆమె దూరలేని గుహ అంతర్భాగాలు లేవు.

నీ మాటలు ఆమె వింటే మరుక్షణం మట్టికరుస్తావు" అన్నదా యువతి ఆ మాట అన్నందుకు అతడు చింతిల్లినాడు.

"మొదలే ఆమె దుందుడుకుతనం కలిగిన యువతి. పులి కంటపడితే పిల్లి వెంటపడి తరిమినట్లుగా తరుముతుంది అది ఎంత ప్రమాదమో ఆలోచించదు. కాలమంతా తనకు అనుకూలంగానే నిలుస్తుందా ఏమి?"

"ఏదైనా ప్రమాదం జరిగిఉండవచ్చు!" అన్నాడు మరొకడు. ఆ యువతి చివాలున లేచింది. ఆమె నేత్రాలు చింతనిప్పలవలె అయినాయి. ముఖం నెగడులా మండపడింది.

"ఇదంతా మీ మగవాళ్ళ అసూయ తప్ప మరేమీకాదు. తుల్యభాగ బతికిఉండగా ఈ గణ ఆవాసాలకి నాయకత్వం మరొకరి వశం కాదని మీరంతా అసూయకు లోను అయినారు,

ఆమెను ముఖాముఖీ ఎదిరించి జయించలేక ఆమెకు ఏదయినా ప్రమాదం జరిగితే బాగుండునని ఆశిస్తున్నారు.

కాని అలాంటిది ఏమీ జరుగదు. దక్షిణాది గణాలకు ఆశా కిరణమయిన తుల్యభాగ క్షేమంగా తిరిగి వస్తుంది. అందాకా ఓపిక పట్టండి. చేవ కలిగినవాళ్లు ఆ తరువాత మాట్లాడండి" అన్నదామె.

ఆ మాటలతో యువకుల ముఖాలు నల్లగా అయినాయి. వాడిపత్తులయినాయి. వారి మానసాలలో పురుషాధిక్యత తాలూకు అహంకృతి ఆవులించి నిద్ర లేచినట్లు అయింది.

ఒక యువకుడు చివాలున లేచి నిలుచున్నాడు. నిందయినకంద బలిమిని పదర్శించినాడు. "కూయకే దొరబిడ్డా! ఆడదానివని ఆదరించినామే కాని మగ




పోడిమి మలిగిపోయిన వారము కాము. అంత చేవ గలిగిన ఆడదే అయితే నాతో పోరాడమను, కండ బలిమి అంటే ఏమిటో. గుండె దిటవు అంటే ఏమిటో మీ తుల్యభాగకు తెలియ వస్తుంది," అన్నాడతడు.

"సాధురే! మగవీరుడా! యక్ష జాతీయుడవనిపించినావు, కోడెనాగుమీద కోర మీసం మువ్వి కవ్వించినావు. నీ మగ పోడిమి ఏమిటో చూపవలసింది మాటలతో కాదు" అన్న మాటలు వినిపించినాయి. యక్ష యువతీ యువకులు నెగడుచుట్టూ చేరిన వారందరూ తలలు త్రిప్పి ఆ వంకకు చూచినారు.

ఎప్పుడు వచ్చిందో తుల్యభాగ!

రెండు చిరుతలయిన పులి బిడ్డలను రెండు చేతులలో యిరికించుకుని వక్షానికి అదుముకుంటూ కన్పించింది. అవి క్రిందకు దూకేందుకు శతవిధాల ప్రయత్నిస్తున్నాయి.

కాని ఆమె బాహు పంజరంనుంచి బయటకు పడడం వాటికి దుస్సాధ్యమయింది. అయినా అవి వాటి ప్రయత్నం మానలేదు. వీలుచిక్కితే నేలమీద

జారిపోవాలని చూస్తున్నాయి. ఆ స్థితిలో కనిపించిన తుల్యభాగను చూడగానే వారితో వాదించిన యువతి ఆనందంతో వివశురాలయింది.

పరుగు పరుగున అక్క దగ్గరగా వచ్చింది.

ఆమె బాహు వల్లరిలో గుంజాటన పడుతున్న పులిపిల్లలను తాను అందుకుంది.

"అక్కా ఈ ప్రొద్దుకూడ పులిని వేటాడేందుకు వెడలినావన్న మాట. ఈ యశులలో వాసాలలో నీవు లేనప్పుడే కదా మగవాళ్ళకు మాటలొస్తాయి" అంటూ అందాకా మీసందువ్వి మాటలు రువ్విన యువకుడివంక ఓరగా చూచిందామె.

పులి పిల్లలను ఆమెకు అందించాక రవ్వంత విశ్రాంతి లభించినట్లు ఒక్కసారి వొళ్లు విరుచుకుంది తుల్యభాగ. తనివితీరా వేటాడి ముక్కుటమయిన మాంస ఖండాలను భోంచేసి గుహాంతర్భాగంలో ఆదమరచి నిద్రించి లేచిన సివంగిలా వొళ్లు విరుచుకుందామె.

రెండు చేతులూ నాగబంధంలా పెనవేసి పైకెత్తి గుండెల నిండుగా గాలి పీల్చింది. ముఖాన్ని ఓరగా ఉంచి అలసట తీరా విశ్వసించింది. ఆ ముద్రలో శరీరాన్ని మునికాళ్ళపై పైకిలేపి శేషశయనం చాలించి సాగివస్తున్న మహా సర్పంలా అంత పొడవున సాగిపోయింది.

మునికాళ్ళపై లేచినప్పుడు పిక్కలు ఉక్కు ముక్కలలాగున కఠినతరంగా అయినాయి. ఆ ముద్రను చూచి విచలితుడయినాడు యువకుడు.

"ఆడదయినా అసాధ్యురాలు" అనుకున్నాడు మనసులో.

చిత్రమయిన ముద్రలో ఒళ్లు విరిచి అలసటను దూరంగా ఆదలించి తుల్యభాగ నులివెచ్చని నెగడు మంటలా గాలి శరీరానికి తగలగానే ఉత్సాహవంతురాలయింది.

"సాధురే! మగధీరుడా మంచిమాట అన్నావు. నీవు నీకు ఉన్నదనుకుంటున్న మగ పోడిమికి ఫలితాంశమేమిటో మచ్చుకొకసారి చూచుకోవటం చాలా అవసరం.

నాతో పోరాడమను అని నీవే కదా అన్నావు. నీతో ద్వంద్వ యుద్ధానికి నేను సిద్ధంగా ఉన్నాను. ఈ ప్రాంతంలో ఉన్న యక్షగణాలకు నా తండ్రి నాయకుడు.

అతడు అకుంఠితమయిన జాతి భక్తితో అజేయమయిన శారీరక శక్తి సంపన్నతో దాన్ని అనగా యక్ష జాతీయులు ఆ వాసముంటున్న ఈ ప్రాంత నాయకత్వాన్ని సంపాదించుకున్నాడు

అతని రక్తాన్ని పంచుకుపుట్టినంత మాత్రంచేత ఆ నాయకత్వం నాకు వారసత్వంగా రావాలని నేను కోరను.

పోడిమి కలిగిన వారిదే కదా ఎన్నడయినా పెత్తనం.

బలిమి కలిగిన వారిదే కదా ఎక్కడయినా శాసనం. నీవు నన్ను ఎదిరించి నిలవాలనుకోవటం సదా నాకు ఆనందదాయకమే అవుతుంది, ఎందుకంటే అర్హతా నర్హతలనేవి ఊహాజనితాలయినవి కాకూడదు.

అవి పలువురి ఎదుట నిరూపించబడాలి. అందుకు నేను సిద్ధంగా ఉన్నాను అంత మగ పోడిమి కలిగినవాడవు అయితే ఆడదానిగా అందించే సమర ఆహ్వానాన్ని మన్నించు" అన్నదామె.

అందాకా ఆమె లేదుకదా అని తన వాచాలత్వాన్ని ప్రదర్శించిన యువకుడు నిర్విణ్ణుడయినాడు. అవాక్కై పడిపోయి రాటలా అయినాడు. విధాత చెక్కి ప్రాణం పోయక వదలిన శిల్పంలా అయినాడు.

తుల్యభాగ నెగడు చుట్టూ తిరిగి అతని దగ్గరగా వచ్చింది.

'సోదరుడా! శక్తి సంపన్నత అనేది నాయకత్వ లక్షణమే కదయ్యా! నీవు యక్ష గణాలకు నాయకుడు కావాలని అనుకోవటంలో తప్పిదమనేది రవంత అయినా లేదయ్యా!

ఎవరయినా కోరవచ్చు ఆశించిన దాన్ని అందుకునేందుకు అర్హత నిరూపించుకోవాలి, రేపటి సుప్రభాత సమయానికి నీ అర్హతని నిరూపించుకుందు సంసిద్ధుడవుకావాలి ఈ ప్రొద్దు శలవా మరి.'' అంటూ అతని సమాధానం కొరకయినా ఆశించకుండా అక్కడినుంచి కదలిపోయింది తుల్యభాగ.

యువతుల తా ఆమెను అనుసరించి లేచిపోయినారు నెగడు దగ్గరే నిలిచిపోయిన యువకుల మధ్య చాలాసేపు తర్జనభర్జనలు జరిగాయి, అది ప్రతిష్ఠాత్మక మయిన అంశమయింది.

ఏది ఏమయినా మరునాటి సుప్రభాత సమయాన చావో రేవో తేల్చుకోవాలని వారంతా కలిసి నిర్ణయించుకున్నారు. ఆ యువకునికి వారంతా ధైర్యాన్ని రంగరించి త్రాగించారు.

తాను చావు బ్రతుకుల సమస్యగా మారిపోయిన ఈ అంశంలో అగ్ర భాగాన నిలువవలసిన ఆగత్యం ఏర్పడినందుకు దుంపిల్లుతూ తనదయిన ఆవాసం లోకి దూరిపోయినాడు యక్ష యువకుడు.

మరునాడు తుల్యభాగతో ద్వంద్వ యుద్ధంలో విజయం సాధించే అవకాశా లను గురించి అశా పేశల మయిన ఆలోచనలను కొనసాగించుకోవటం ప్రారం భించినాడు.

నెగడు దగ్గరనుండి నేరుగా తన యింటికి చేరుకుంది తుల్యభాగ. రెల్లుతో కప్పిన మంటి యిలు సువిశాలమయినది. అన్ని వసతులకూ యింటిలో అన్ని ఏర్పాట్లు అమరించబడి ఉన్నాయి

తండ్రి అయిన కుండాలకుడు యక్షగణాలకు అధినేత. అతడు ఆర్య లతో పౌత్తరాహులతో సంప్రాప్తమయిన అనేక యుద్ధాలలో విజేత. అందునించి యక్షగణాలకు అధినేత కావటమే కాక ఆరాధ్య దైవము కూడ అయినాడు.

అతని చూచేందుకు ప్రాంతీయమయిన స్థితిగతులను చర్చించేందుకు పశ్చిమ దిన్నెలో రాచరికపు పోకడలు సాగుతున్నచోటునించి వార్తలు అందిం చేందుకు అనునిత్యమూ ఎవరో కొందరు వస్తూనే ఉంటారు.

రాజు అనగా సామ్రాజ్య విస్తరణ కాంక్షాపరుడు శాంతికాముకులయిన వారికి, స్వేచ్ఛా పరిరక్షణలో ప్రాణాలు అర్పించే వారికి అతడు ప్రత్యర్థి అయితే వారికి పౌత్తరాహులు అండదండలుంటాయి. ఉత్తరాపథాన గణ వ్యవస్థ లన్నీ నశించాయి.

రాచరికపు వ్యవస్థలు ఏర్పడినాయి. అహిఛత్ర, కోసల, కాంపిల్య, ముద్ర, మగధ, పుష్కలావతి, గాంధార, నగరాలన్నీ గణవ్యవస్థలు అంతరించి పోగా శల్యావశిష్టంగా, రాచరికపు బాహుపంజరాలలో బందీలయినాయి.

వారు స్వార్థపరులు. ఒకని పాలనలో పదుగురు జీవించాలి. వింధ్య పర్వతాలను దక్షిణంగా నర్మద తపతి నదుల్ని దాటి వచ్చాక దండకారణ్య ప్రాంతాలు ఆరంభమవుతాయి.

దండకారణ్యంలో ఎన్నో జనగణాలు ఆవాసముంటున్నాయి. నాగయక్ష పుండ్ర, పుళింద, మూతిబి, కళింగ, శాబరీ, అశ్వక, భోక, మహిషక గణాల వంటివి ఎన్నో ఆవాసముంటున్నాయి.




దండకారణ్య ప్రాంతమంతా సారవంతమయిన భూములు మూడు ప్రక్కల జల సంధువులతో విరోధులనించి రక్షా కవచాన్ని ధరించిన పవిత్రభూమి దక్షిణభూమి.

మహానది, తెలివాహా, ఇంద్రావతి, గౌతమీ కృష్ణ, వంశధార, చంద్రభాగ వంటి నదులు ఎన్నెన్నో! నదీ తీరాలలో నాగరికత ప్రభవిల్లుతోంది. నదీ ప్రవాహక ప్రాంతాలలో సారవంతమయిన పంట భూములు సస్యశ్యామలంగా పంటలు అందిస్తాయి.

దాక్షిణాత్యులయిన దండకారణ్య ప్రాంతవాసుల జీవితాలు ప్రశాంత మయినవి యుద్ధ భయాలు లేనివి.

కాని ఔత్తరాహులకు వారి సంపదలు చూచి కన్నుకుట్టింది. సస్యశ్యామలమయిన సంపదలు అన్నీ జనగణాలమీద పరచుకుపోయి వుండటం వారికి అసూయ కారణమయింది.

సంపదలన్నీ ఒకే వ్యక్తి దగ్గర పోగుపెట్టుకోవటం వారి నాగరికత. రాజు అనే పేరుతో, అందరికీ రక్షణ కల్పించే మిషతో వారి మీద అధిపత్యాన్ని చలాయించడం వారి దుర్నడత.

కాని సాగుతోంది. వారు ఆడింది ఆట, పాడింది పాట అయిపోతోంది బలవంతులు దుర్బరులను హింసించారు. వారి నెత్తిమీద ఎక్కి కూర్చుని సవారి ప్రారంభించినారు.

ఇదంతా ఉత్తరాది భూములకు పరిమితమయి పోలేదు. ఆ ప్రాంతాలలో ప్రజల ధన మాన ప్రాణాలను దోచుకున్న ఆర్యరాజుల దురాశ దండకారణ్యాలకు విస్తరించింది.

వారికన్నా దక్షిణాది భూముల పైకి వచ్చి నిలబడింది.

అందునించి అప్పుడప్పుడు దండయాత్రలు జరుగుతున్నాయి వజ్రాల దిన్నెలో రాచరికపు విషభూరుహం వేళ్లునాటింది

దాని ప్రభావానికి లోను అయి కృష్ణాతీర భూములన్నీ దురిపిల్లుతున్న దుర్దినాలు ఇవి. అందునించి రాజుల రాక్షస ప్రవృత్తినించి రక్షణ పొందటం వారి ప్రధాన కర్తవ్యం.

ఈ విషయాలు చర్చించేందుకు అనునిత్యమూ కుండాలకుని దగ్గరకు ఎవరో ఒకరు వచ్చిపోతుంటారు.

అతిథులతో మాట్లాడేందుకు ఒక వసారా ఉన్నది అక్కడ కాలు పెట్టింది తుల్యభాగ్య బాగా ప్రొద్దు పోయినా తండ్రి ఇంకా నిదురించలేదు. ఎవరి కోసమో ఎదురుచూస్తూ అలాగే కూర్చుని ఉన్నాడు. తుల్యభాగ వచ్చిన అలికిడి విన్నాడు.

అతడు బాగా వయోవృద్ధుడు. శరీర పటుత్వతం రవ్వంతగా సడలి పోయింది. తొమ్మిది పదులు దాటిన వాడయినా ఖడ్గ చాలనం చేయగలడు. ఈతె వినంగలడు. గుర్రపు స్వారీ చెయ్యగలడు.

ఈత కార్యక్రమంలోకి దిగినాడంటే వరదలో చిక్కిన కృష్ణసర్పంలా దూసుకు పోగలడు. అయితే చూపు రవ్వంత సడలింది. జ్ఞాపకశక్తి సన్నగిల్లు తోంది.

వయోభారం ఇకముందు ముంపులా వచ్చి కుంగదీయగలదన్న సూచనలు కానవస్తున్నాయి.

మంచెమీద కూర్చుని ఏదో మంత్రాలోచనలు చేసుకుంటున్నావాడు తుల్యభాగ అడుగుల సవ్వడి నడి కన్నాడు. తలయెత్తి చూచినాడు.

ఆముదపు దీపాల వెలుగులో తనూభవ అయిన తుల్యభాగ రూపం పసందుగా కన్పించలేదు అంతా అలుక్కుపోయినట్టుగా అస్తవ్యస్తంగా అయిపోయిన ఆకృతి కన్పించింది.

నేరుగా వచ్చి తండ్రి పాదాలకు నుదురు తాకించింది తుల్యభాగ. తనూభవ శిరస్సును ముద్దాడినాడు వయోవృద్ధుడయిన కుండాలకుడు.

'తల్లీ! తుల్యభాగా! వృశ్చికరాసి! పశ్చిమానికి వాలిపోతున్నవేళ అయింది కదా! ఇంతవరకూ ఎక్కడెక్కడ తిరిగివచ్చినావు తల్లీ!' అని అడిగాడు అతడు. తుల్యభాగ తలదించుకుంది.

'వేటకోసం వెళ్ళాను' అన్నది నెమ్మది అయిన స్వరాన.

తండ్రి అయిన కుండాలకుడు పడగమీసం సవరించి పెదవుల మాటున పసందుగా నవ్వుకున్నాడు.తనబిడ్డ. తనూభవ వేటలో ఆమెకు సాటిరాగలిగిన వారెవరు యక్షగణాలలో ఎవరూ లేరని వారూ వీరూ చెప్పుకోవటం విన్నాడు. అది జ్ఞాపకం వచ్చి పెదవుల మాటున పసందుగా నవ్వుకున్నాడు,

కుండాలకుని తనూభవ ఆ మాత్రం చెయ్యలేదా! ఈ రక్తానికి వారసురాలు వేటలో అందెవేసిన చెయ్యి కావడంలో ఆశ్చర్యమేమున్నది అనుకున్నాడు.

"అమ్మా! ఈ ప్రొద్దు నీ లక్ష్యానికి చేరువలోకి వచ్చిన ఆ దురదృష్ట ప్రాణి ఏది? ఎక్కడ?" అని అడిగాడు.

తుల్యభాగ తల దించుకునే జరిగిన దృశ్యాన్ని జ్ఞాపకం చేసుకుంది. కన్నులు రసార్ద్రమయినాయి. బాలెంతరాలయిన పులి ప్రాణాలు ఉత్క్రమణం అవుతున్న సమయాన బిడ్డలవంక చూచిన చూపే జ్ఞాపకం వచ్చింది.

మాతృత్వంలోని మహనీయతను క్రూరంగా హింసించి అవమానించింది తాను, ఛీ ఇదేమి ఆడపుట్టుక అనుకుంది మనసులో.

"ఏమీ దొరకలేదా తల్లీ" అని అడిగాడు కుండాలకుడు మంద్రస్వరాన.

ఉలికిపడి పౌరుషంగా చూసింది తుల్యభాగ

"నాన్నగారూ మీ రక్తం పంచుకుపుట్టిన బిడ్డ అప్రయోజకురాలు అవుతుందా, కాని ఈవేళ నావల్ల ఒక తప్పిదం జరిగిపోయింది. ఆ దృశ్యాన్ని తలుచుకుంటే కనులు చెమ్మగిల్లుతున్నాయి." అన్నదామె గద్గదస్వరాన.

తండ్రి ఆమె తలమీద చేయిపెట్టి ఓదార్పుతున్నట్లుగా నిమిరాడు.

"తల్లీ పరాక్రమమంటే ప్రాణ హింసయే కదా అందు గురించి వగపు చెందటం ధీర లక్షణం కాదమ్మా హృదయాన్ని ఎన్నడూ దుర్బలం కానివ్వకు' ఒకసారి పిరికి లక్షణం గుండెల్ని తాకిందో ఇంక అది జీవితం ఆసాంతమయే దాకా నిలిచిపోతుంది.

"ఏమి జరిగింది" అన్నాడు కుండాలకుడు ఓదార్చుతూ.

తుల్యభాగ చీరతో కన్నీరు ఒత్తుకుంది.

"నాన్నగారూ మీ బిడ్డ పిరికి మందు తిన్నది కాదు. కాని నావల్ల ఈనాడు ఒక తప్పిదమే జరిగిపోయింది అందుకు వగపు చెందుచున్నాను ఒక బెబ్బులిని రిక్కవేసి కవ్వించాను

పాపం అది పచ్చి బాలెంతరాలు.

రిక్క విని రాలిపోతున్న ఉల్కలా వచ్చిపడింది పోరాడి వధించాను. కాని పాపం పసికూనలు దిక్కులేనివైనాయి. ప్రాణాలు ఉత్క్రమణం అయిపోతున్న సమయాన ఆ తల్లి పులి చూపులలో పొందిన మాతృత్వము హృదాకాంక్ష నా గుండెల్ని పిండివేసింది.

పులికూనలు తల్లిని కోలుపడి గోలగోలున విలపించినాయి,

ఆ దృశ్యాన్ని చూచినప్పుడు నా గుండె కరుణాతరంగితమయిపోయింది. కాయ కసువూ ఉన్నాయి కడుపు నింపుకోవచ్చుకదా

ఈ ప్రాణ హింస ఎందుకు చేయాలి అనిపించింది నాన్నగారూ ఆ దృశ్యం జ్ఞాపకంవస్తే కనులు చెమరించుతున్నాయి" అన్నదామె.

కుండాలకుడు చిన్న మందహాసం కావించాడు.

"ఆడదాయిలకు ఈడు వచ్చాక మాతృత్వంలోని మధురిమలు ఒకరు నేర్పకుండానే తెలుస్తాయి నిన్ను చూస్తే నాకు నవ్వు వస్తోంది.

నీవు వేటాడే ప్రతి మృగానికి ఆత్మీయతాబంధం కలిగిన తల్లిదండ్రులలో ప్రాణ విభుడో, సోదర మృగాలో ఉండి తీరతాయి.

వాటి గురించి వగపు చెందనిదానవు కదా మరి యీ మాతృత్వ మధురిమలకు ఒకింతఒణికావంటే అర్థమేమిటి?

నీవు ఒక మగతోడు వెతుక్కోవలసిన ఈడు వచ్చిందనేకదా" అన్నాడు కుండాలకుడు చిరునవ్వు నవ్వుతూ. (సశేషం)

# మది నమ్మిన మాట

డియర్ ప్రేమా

ఎన్నో రోజులనుంచి నీకీ ఉత్తరం వ్రాయాలని- కాని తీరిక ఎక్కడ? ఉదయము నుంచి సాయంత్రందాక ఒకటే పని ఒక క్షణం తీరిక దొరికితే నీకు లేఖ వ్రాసే ప్రశాంతతా, ఏకాగ్రత వుండదు ఇంతకీ నువ్విప్పుడు ఎక్కడున్నావు? ఏం చేస్తున్నావు?

తీరికలేని జీవితం గడుపుతున్నా అనుక్షణం నువ్వు నాకు జ్ఞాపకం వస్తూం టావు. సూర్యుడు, చంద్రుడు, విశాల ఆకాశం అందులో తేలిపోయే మబ్బులు, వృక్షమూ, వెన్నెలా, పుట్టలూ-పిట్టలు, కొండలలూ-నదులూ: వీటిని చూసినప్పు డల్లా నువ్వే మనసు నిండా నిండి పోతావు అంతా ప్రేమమయంగా తోస్తుంది. నీలాగా వాటికి అందరూ సమానమే ఎప్పుడ వాటి చుట్టూ మసలుతూ, వాటితో దగ్గరి సంబంధం వున్న మనిషి వాటిలా మమతనీ, సమతనీ ఎందుకు పెంచుకోలేక పోతున్నాడో? వాటిని ఆదర్శంగా తీసుకుని నీకు దగ్గర కావాలని నా తాపత్రయం. ప్రేమమయి మదర్ థెరిసా అన్నట్లు "ఈ ప్రపంచములో కరువు అన్నానికీ, వస్త్రానికి కాదు- ప్రేమకు" ఆమె మాట అక్షరాల నిజం. అందుకు అనుదినం మనకి ఎన్నో ఉదహరణలు అందాకా దేనికి. సుప్రసిద్ధ హాలివుడ్ తార మార్లిన్ మన్రో నటిగా ప్రపంచఖ్యాతి పొందింది కావల్సినంత డబ్బు గడించింది. కీర్తికి కొదువలేదు కాని నిజమైన "ప్రేమ" దొరక్క ఆమె ఆత్మహత్య చేసుకుంది. ఇలాంటి ఆలోచనలతో మనసు వికలమైపోతూవుంటుంది. అలాంటప్పుడు గతాన్ని నెమరు వేసుకుంటూ వుంటాను—

ప్రేమా! నీకు గుర్తుండే వుంటుంది, 27 ఏళ్ళ క్రితం నేను ఎం ఏ. అయ్యాక యీ పట్టణంలో ఏమిచెయ్యాలో తోచక, అందంగా అమర్చిన మిఠాయి దుకాణాల ముందు ఆకలి కళ్ళతో చూస్తూ నిలబడి నప్పుడు "రావ్" అనే టైలర్ భుజంమీద చెయ్యివేసి నన్ను మీ ఇంటికి తీసుకువచ్చాడు. అప్పుడు నువ్వు మీ తమ్ముడు సత్యం, మీ చెల్లెలు ఆశా డాబామీద కూర్చుని పిచ్చాపాటీ మాట్లాడు కున్నాం గుర్తుందా? ఆ మసక వెన్నెల్లో కొబ్బరి చెట్లకు వేలాడే గిజిగాడి గుళ్ళని చూస్తూ నేనూ- నిశ్శబ్దంగా కూర్చున్న నువ్వూ-ఆశ చాలా ప్రోత్సాహం ఇచ్చి

సత్యం నేను వుంటాకదా పర్వాలేదన్నాడు. మీరంతా బాసటగా వుంటే ఏమైనా చేయగలనని నాకు నమ్మకం చిక్కింది. కొండంత ధైర్యం వచ్చింది.

ఆ రావ్ కుట్టించిన రెండు జతల పైజామా లాల్చీలు, రామస్వామి ఇచ్చిన 30 భోజనం టిక్కెట్లతో నువ్వు పిల్చుకు వచ్చిన పట్నం నుండికి నేను మాస్టారినయి నాను అప్పుడు నా వయసు పంధొమ్మిది. నా అంత వాళ్ళకి నేను చదువు చెప్ప టము తల్చుకుంటే తమాషాగా వుంటుంది. తర్వాత ఎన్నో వసంతాలు హేమం తాలు వచ్చాయి. వెళ్ళాయి. మబ్బులూ, వానలూ, ఎండా, వెన్నెలా, వస్తున్నాయి. పోతున్నాయి, చెట్లూ, పిట్టలు, కొండలు. కోనలు. అప్పటి నా ఆదర్శాలు. వాటి వాటి నైజాలను మార్చుకోకుండా వుంటున్నాయి. ఒక లక్షమందికి పైగా విద్యా ర్థులు నా శిక్షణలో చదివి వివిధ వృత్తులలో వ్యాపారాలలో స్థిరపడ్డారు. ఇంజనీరు. డాక్టర్లు, లాయర్లు, ఉపాధ్యాయులూ, ఆఫీసర్లు, వ్యాపారస్థులూ, ఇలా అన్ని రంగా లలో— వారి వృత్తి ఏదేనా, వ్యాపకం ఏదైనా నా వారంతా విద్యార్థులే జీవిత ములో ఎందరో కవులు, కళాకారులు, చిత్రకారులు, శిల్పులు, క్రీడాకారులు పరిచ యమైనారు. ఇది నా అదృష్టం. నీ చలవ.

కాని ప్రేమా! ఒక్కోసారి జీవితం ఎంత శూన్యంగా తోస్తుందో చెప్పలేను. డబ్బుకి విలువ ఇచ్చి మాట్లాడే మనుష్యులు ఎక్కువయిపోయారు.

"నీవెలా ఉన్నావ్" అని నీలాగ పలకరించే వాళ్ళకంటే "నీకేమయ్యా" అని ఈర్ష్యగా ధ్వనించేలా పలకరించే వాళ్ళెక్కువయ్యారు. రంగస్థల నటులు. మధుర గాయకులు వారి నటనతో, మధుర గానంలో ప్రేక్షక శ్రోతల్ని పరవశింప చేస్తారు. ఆనందించి హాయిగా ప్రేక్షక శ్రోతలు వెళ్ళిపోతారు కాని ఆ కళాకారుల గురించి ఎందరు ఆలోచిస్తారంటావ్

"హాల్స్ ఆర్ ఫుల్ బట్ హార్ట్స్ ఆర్ ఎంప్టీ"

యీ వాక్యం జ్ఞాపకం వచ్చినప్పుడల్లా గుండె కలుక్కుమంటుంది. ఏదో ఒక వెలితి నన్నావరిస్తుంది. అలాంటి సందర్భంలోనే ఓ సారి నిన్ను చూద్దా మని మీ ఇంటికి వచ్చా "ప్రేమ వున్నదండీ" అని అడిగా. "ఎక్కడికో వెళ్ళిం దండీ" అని జవాబు చెప్పారు మీ ఇంట్లో. ఆ జవాబులో అనేక అర్థాలు స్ఫురిం చాయి నాకు తల దించుకు వచ్చేశాను. మరికొద్ది రోజులకి "సత్యం" పరార య్యాడని పేపర్లో ప్రకటన చదివా. ఆశకు అనారోగ్యంగా వుందని తెలిసింది. చాలా బాధపడ్డాను వున్నట్టుండి ఓ రోజు మా "బాకా" కన్పించాడు "బాకా"

అంటే దుర్యోధన్ల్డా? మీతో ఎక్కువ స్నేహంగా వున్నట్టు నటించేవాడు ఎప్పుడూ తన గురించి తను మాట్లాడేవాడు. అందుకే మనం "బాకా" అని ముద్దు పేరుతో పిలిచేవాళ్ళం. అతనిలో మార్పేమీలేదు. గంటసేపు సొంత బాకా వూదాడు. అందులో పెట్టన్నాడు-ఇందులో పెట్టన్నాడు-ఏంచేటో చెప్పాడు. నాకు సరిగ్గా అర్థం కాలేదు కాని తర్వాత విచారిస్తే అతనొక విద్యాసంస్థ పెట్టాడనీ, నానారకాలుగా డబ్బు సంపాయించాడనీ తెలిసింది.

ఇవన్నీ చూస్తుంటే ఏం చెయ్యాలో అర్థం కావడం లేదు. మీ ముగ్గురి దగ్గరా నేను నేర్చుకున్న మొదటి పాఠం ఈ జీవితానికి చాలనిపిస్తుంది. అలాగే జీవిత యాత్ర సాగిస్తున్నా- నాకు విచారంలేదు, అసూయలేదు. అహంకారంలేదు. దానికి కారణం మీరే ఎంతో డబ్బు వచ్చింది-పోయింది. అయినా 27 ఏళ్ళ నాడు మీ దాబా మీద మొదటిసారి ఎలా వున్నానో ఇపుడు అలాగే వున్నాను. చిన్న చిన్న మార్పులు లేకుండా వుంటవనుకో, మనం యంత్రాలమీద తయారయిన వస్తువులం కాదు- జీవం వున్న మనుషులం.

ఆ మధ్య అనుకోకుండా ఓ రోజు మన సత్యం కన్పించాడు, చిక్కి సగమైపోయాడు

"ఇల్లు వదలి వెళ్ళిపోయావట దేనికీ?" అని అడిగితే-

"నేనెవరికి కావాలి మాస్టారూ?" అన్నాడు నిష్ఫ్రూరంగా. నేను ధైర్యం చెప్పడానికి ప్రయత్నిస్తే, సత్యం నిట్టూర్పుగా నవ్వి-

"రోజులు మనవి కాదుసార్. మన "బాకా" తెల్సుగా, వాడు పరీక్ష పేపర్లు కొనుక్కొని, కాపీ కొట్టి మార్కులు తెచ్చుకుని పాసయ్యాడు వాడూ నేను ఒకటేనా చెప్పండి?" అన్నాడు.

"సత్యం నువ్వే తప్పక జయిస్తావు. నిజం నిలకడమీద తెలుస్తుంది." అని వూరడించాను. ఆశ కులాసాగా వుందనీ కొంచెం కోలుకుంటోందని చెప్పాడు.

ప్రేమా! నేను యీ వృత్తిలో అడుగు పెట్టడానికి నాంది పలికిన రోజు మీ డాబా పిట్టగోడ మీద నేను కూచుని ఉండగా నువ్వొక మాట చెప్పావ్. జ్ఞాపకం వుందా? నేనెపుడూ ఆ మాటలను జ్ఞాపకం చేసుకుంటూ వుంటాను, అవి ఓ అజ్ఞాత సైనికుని సమాధిపై వ్రాసిన మాటలని చెప్పావ్.

"ఒక సైనికుడు తన దేశం పై గల ప్రేమతో నేలకొరిగాడు. ఎవడైనా ఇటు వైపు వెళ్ళటం తటస్థిస్తే ఒక కన్నీటి బొట్టుంచి రాల్చండి" అని.

ఆ శిలాక్షరాలే నా జీవితం. నువ్వే నా లక్ష్యం. లక్షలాది విద్యార్థులు వారి తల్లితండ్రులు ఇరుగు పొరుగు వారు, మిత్రులు, ఆప్తులు ఇది గుర్తిస్తే చాలు.

ఇంతకీ సమాచారం తెలియనే లేదు. బావున్నావు కదూ. మునుపటిలాగే మాటా పలుకూలేకుండా అలాగే వుంటున్నావా? ఎందుకు పుత్తరం వ్రాయలేదు ఇన్నాళ్లు? కోపమా? నీ హృదయంలో కోపానికి చోటులేదే. నేను మారిపోయానని అనుమానమా? కావాలంటే మీ సత్యాన్నడుగు. అప్పుడూ ఇప్పుడూ అలాగే వున్నాను.

ప్రేమ, సత్యం, ఆశ, శ్రమ అనే నాలుగు సూత్రాలమీద నడుస్తోంది గుంటూరులో గల "రవి కళాశాల," ఈ 27 సంవత్సరాలలో లక్షలకుపైగా విద్యార్థులు శిక్షణ పొంది మమల్ని ప్రేమతో పెంచారు. వారికి కృతజ్ఞతలు.

మీ

సి. వి. యస్. ధన్

# ఆభరణాలతో ఆరోగ్యం




**కేవలం అందానికీ అలంకారానికే కాక ఆభరణాలకీ ఆరోగ్యానికి సంబంధం వుంది!!**

ఈ చిత్రానికి ప్రత్యక్ష నిదర్శనం మాజీ కల్నల్ జె హంటర్ రియిన్ బర్గ్.

హంటర్ రియన్ బర్గ్ కి యిప్పుడు అరవైరెండేళ్లు. ఫ్లోరిడానుంచి వచ్చిన యితన్ని ముందు ఎయిర్ ఫోర్స్ కి పనికిరావన్నారు. కంటిచూపు యిబ్బందివల్ల యుద్ధ విమాన పైలట్ గా పనికిరాని ప్రమాదం ఏర్పడింది. క్షీణిస్తున్న కంటి చూపువల్ల నేవల్ ఫోర్స్ తిరస్కరించింది. కానీ రెండో ప్రపంచ యుద్ధ కాలంలో సడలించిన నిబంధనల ఆసరాతో 1941లో పైలట్ స్కూల్ లో చేరి గ్రాడ్యుయేషన్ పూర్తిచేశాడు

ఎంతో ఉత్సాహం, ధైర్యంవున్నా కంటిచూపు కారణంగా రియిన్ బర్గ్ పైలట్ గా రాణించలేకపోయాడు.

కానీ వోసారి పోలీసియన్ దీవిలో తారసపడిన ఓ మగువవల్ల రియిన్ బర్గ్ జీవితమే మారిపోయింది.

"నాకుసహజంగా చెవులకీ, ముక్కుకీ ఆభరణాలు ధరించే ఆడవాళ్ళంటే ఆసక్తి ఎక్కువ. నాకు తారసపడిన యీ అమ్మాయి ముక్కుకి పెద్ద రింగుతో పాటు, చెవులకి దుద్దులు చిత్రమైన పద్ధతిలో ధరించటంవల్ల నా ఆసక్తి మరింత

పెరిగింది, పైగా అలా రింగులు, దుద్దులు పెట్టుకోటంవల్ల ఆరోగ్యం, కంటిచూపు మెరుగుపట్టమేకాక, శృంగార ధారుధ్యంకూడా పెరుగతుందని తమ తెగవాళ్ళ విశ్వాసం అని చెప్పారు నేను మరింత శ్రద్ధగా ఆ అమ్మాయి చెప్పింది విన్నాను" అంటాడు రియన్ బర్గ్.

ఆ తర్వాత ఆ దీవిలోని తెగవాళ్ళని పరిశీలించి, మిగిలినచోట్ల మరింత సమాచారం సేకరించి రియన్ బర్గ్ కూడా చెవులకి ముక్కుకి కన్నాలు పొడిపించుకుని పేపర్ క్లిప్స్, రింగులు ధరించటం ఆరంభించాడు. ఎయిర్ ఫోర్స్ వాళ్లు యిది ధరించటానికి ఒప్పుకోరు కాబట్టి కేవలం రాత్రిళ్ళే ధరించేవాడు. పగలు తీసేసేవాడు. క్రమంగా అతని కంటిచూపు గొప్పగా మెరుగుపడింది.

"అరవై రెండేళ్ల యీ వయసులో నా ఆరోగ్యం, కంటిచూపు ఎంతో బాగున్నాయి. నిత్య యవ్వనుడిలా నేనిలా వుండటానికి యీ ఆభరణాలే కారణం" అంటాడు యిప్పటికీ.

రియన్ బర్గ్ చెప్పే యీ విచిత్ర సమాచారాన్ని డాక్టర్లుకూడా ధృవీకరించారు. చెవికి, ముక్కుకి శరీరంలో యితర భాగాలకి కీలక సంబంధం వుందనీ, వీటి కేంద్రంగా వైద్యం చెయ్యటం ఆకూపంచర్ విధానంలో కొత్తకాదని చెప్పారు.

అంతేకాక ప్రముఖ డాక్టర్ బ్రెస్లెర్ రియన్ బర్గ్ ని సమర్థించటమేకాక ఆభరణాలు, ఆరోగ్యం అన్న అంశంమీద పరిశోధనచేస్తే చారిత్రాత్మకంగా ఉన్న ముఖ్య విషయాలు బైటపడే అవకాశం వుందని సూచించాడు. ★

---

లాస్ట్ పఫ్

"సగటు మనిషి నేలజీతం కాల్తున్న ఓ సిగిరెట్
పదో తారీఖునాడే పాపం అతనికి లాస్ట్ పఫ్"

డి. యల్. ఎన్. శాస్త్రి

---

# కొత్తమలుపు

"వెరీగుడ్" అన్నారు ఇంద్రప్రసాద్. కాయితాల చప్పుడు ఆగింది. తలెత్తి చూశాను. నావూహా నిజం। నిర్మాత చౌదరీ, ఆయనగారి మిత్రుడూ ఆశ్చర్యంగా చూస్తున్నారు ఇంద్రప్రసాద్ గారివైపు.

ఇంద్రప్రసాద్‌గారినోటమ్మట గుడ్ అన్నముక్క రావటమే గగనసదృశం అని ప్రతీతి కొమ్ములు తిరిగిన రచయితలు సైతం, తమ సంభాషణలు వినిపించి ఇంద్రప్రసాద్ గారి నుంచి భేష్ అనిపించుకోవాలని తహతహలాడతార్ట. అలాటిది నాబోటి సరికొత్త రచయిత రాసిన కథ వింటూ 'వెరీగుడ్' అని ఆయన అనటం పరిశ్రమకో సంచలన వార్తే. ఇంద్రప్రసాద్‌గారు దర్శకత్వానికి అంగీకరించటమే చిత్రానికి సగం బలమైతే, ఆయనకి 'వెరీగుడ్' స్క్రిప్టు దొరకటం చిత్ర రజతోత్సవానికి నాంది అన్నది పరిశ్రమ నానుడి. అందుకే చౌదరిగారు, ఆయన మిత్రుడూ ఆశ్చర్యపడ్డది ఆవెనక ఆనంద పరవశులయిందీనూ.

వాళ్లనలా వుంచితే ముందు నా రొట్టె తేనెలో పడ్డట్టే. నేను రాసిన మొట్టమొదటి నవలయిది. సినిమాని దృష్టిలో పెట్టుకు రాసిందికాదు. సీరియల్‌గా పత్రికలో వస్తున్నరోజుల్లో పాఠకులు మాత్రం నవల్ని పొగడ్డంతో పాటు, సినిమాగా రావాలనీ ఆకాంక్షిస్తూ ఉత్తరాలు రాశారు. ఆముక్క ఎవరు చౌదరిగారి చెవిన వేశారోగానీ- సినిమాప్రపంచానికి బొత్తిగా సంబంధం లేనినాకు ఓ శుభోదయాన ఉత్తరం వచ్చింది. ఆయన దగ్గర్నుంచి- మదార్సుకి వచ్చి తనని కలిస్తే, నానవల్ని సినిమాకి కొనే విషయం మాట్లాడతామని.

విపరీతంగా ఆశ్చర్యపడి, తేరుకున్నాను, వెంటనే ఆఫీసుకి వారంరోజుల శలవు పడేసి రైలెక్కాను.

మద్రాసు చేరుకుంటూనే ఓ హోటల్లోదిగి, శాస్త్రిఫ్రెష్ ఆయి చౌదరి గారికి ఫోనుచేశాను, 'ఆఫీసుకి వచ్చెయ్యండ'న్నాడాయన.

నేవెళ్ళే సరికే ఇంద్రప్రసాద్‌గారూ, చౌదరిగారూ కూర్చునివున్నారు. పరిచయాలయ్యాయి. నానవల్ని ఇంద్రప్రసాద్‌గారు చదవనేలేదట టూకీగా కధ మాత్రం విన్నార్ట 'ఎలిమెంటు బాగుంది ఒకె' అన్నార్ట. ఇప్పుడు, నవల్లో ముఖ్య సన్నివేశాలు నేనుచదువుతుంటే వినటం ప్రారంభించారు, మధ్యలో ఆయన పాస్‌చేసిన కామెంట్ "వెరీగుడ్."

"సంభాషణలు కూడా పట్టుగానే ఉన్నాయి, మనసినిమాకికూడా యీయన చేత మాటలు రాయించేస్తే?" ఇంద్రప్రసాద్‌గారు నావైపు నవ్వుతూ చూస్తూ అన్నారు.

'మీఇష్టం.మీకంత గురి కుదిర్తే ఇహ అడ్డేముందీ" అన్నారు చౌదరిగారు నవ్వుతూ,

దాంతో నా మకాం మద్రాసులో వారం, పదిరోజులకి స్థిరపడింది, ప్రతిరోజూ ఆఫీసులో కధమీద చర్చలు సన్నివేశాల వివరణ. నాకధకి ఇంద్రప్రసాద్‌గారు అక్కడక్కడ సూచిస్తున్న మార్పులు వింటుంటే నాకు సిగ్గేస్తోంది

అటువంటి మంచి ఆలోచనలు నాకే కానందుకు.

వారం రోజుల్లో కథ ఒకొలిక్కి వచ్చింది ఆరోజు ఇంద్రప్రసాద్‌గారి చిత్రమేదో షూటింగ్ జరుగుతుంటే స్టూడియోకి వెళ్ళాను, అక్కడే.... అక్కడే కనపడింది శ్రీమాలి. అదిగో సరిగ్గా అక్కడే మొదలయింది ఈకథ ఇంత వరకూ చెప్పింది కేవలం నాసొద

o o o

ఆమె శ్రీమాలే నని నిశ్చయించు కోవటానికే పావుగంట పట్టింది నాకు, పోలిక తెలుస్తూనేవున్నా, అంతకి ముందు ఆమెను అక్కడ వూహించ నైనా వూహించకపోవటంతో ఆమెని ఆమెగా అంగీకరించటానికి నామన సంత త్వరగా ఒప్పుకోలేదు. తర్వాతి షాట్ కంటిన్యూ కావటంతో ఇంద్ర ప్రసాద్‌గారు బిజీగావున్నారు. అది గమనించి నేను శ్రీమాలిని అనుసరించి ఫ్లోర్‌దాటి బయటకు వచ్చాను. "శ్రీ మాలీ" పిలిచాను, కొరడాదెబ్బ పడి నట్టు వెనక్కి తిరిగింది శ్రీమాలి. నన్ను చూడగానే ఉలిక్కిపడింది. ఉలికి పాటుని కప్పిపుచ్చుకుంటూ అంది.

"నాపేరు శ్రీమాలికాదు. లలిత"

ఈసారి కొరడాదెబ్బ నామీద పడ్డట్టయింది ఉలిక్కిపడటం నావంత యింది, శ్రీమాలి పోలికలు ఇంత స్పష్టంగా కన్పిస్తుండగా కాదంటుం దేమిటి?

"లలిత," అస్పష్టంగా ఉచ్ఛరిం చాను ఆపేరు. "మీది శంఖవరం కాదూ?"

"కాదు జిగురపల్లి" చటుక్కున తలతిప్పుకుని, విసవిసా నడిచి వెళ్ళ పోయింది ఆమె....అదే నడక ...నాకు తెలుసు.

"శ్రీ.... లలితా"

ఆమె వెనక్కి తిరగటంలోనే అయి ష్టత వ్యక్తమయింది కానీ నేను వూరు కోదల్చుకోలేదు.

"నువ్వు శ్రీమాలివే. నాకు తెల్సు. ఫీల్డులోకి వచ్చాక వూరుమార్చుకున్నా వేమో కానీ పేరు కూడా మార్చుకోవా ల్సిన అవసరమేమిటో నాకర్థంకావటం లేదు నువ్వు నిజంగా నన్ను గుర్తు పట్టలేదూ? తీవ్రంగా అడిగాను,

"గుర్తుపట్టటానికి నేను మిమ్మల్ని ఎప్పుడైనా చూస్తేనా?"

"ఎప్పుడు చూళ్లేదూ? నువ్వు కాశీ పతి గారమ్మాయివి కాదూ? బావా అంటూ నన్నూ, అత్తయ్యా అంటూ మా అమ్మనీ చుట్టుకు తిరిగిన శ్రీ మాలివికాదూ?"

"కాదు, మీరు పొరబడుతున్నారు"

ఆమె వెనక్కి తిరిగి వెళ్లిపోయింది. నేను ఆశ్చర్యంతో అలాగే నిలబడి పోయాను,

o o o



రాత్రి కంటిమీద కునుకులేదు. ఎయిర్‌కూల్ గది చల్లగా వుంది. యూఫోం పరుపు మెత్తగావుంది, కడుపులో చోటు చేసుకున్న భావం మత్తెక్కిస్తూవుంది. అయితేనేం కంటిమీద కునుకురాలేదు!

హఠాత్తుగా కనిపించి మానుతున్న మనోగాయాన్ని రేపినది శ్రీమాతే!

నేను నిక్కర్లలోంచి పాంట్లలోకి మారుతూ, అద్దం కళ్లముందు పెట్టుకుని, కళ్లు పత్తికాయల్లా చేసుకుని మీసాలకోసం వెతుక్కునే వయసులో మాయింటి పక్కన దిగారు బాలరాజుగారు. బాలరాజుగారు బడిపంతులుద్యోగం చేసేవారు ఆ ఉద్యోగం మా బళ్లోనే కావటం, ఆయన హయ్యరు ఫారాలకే

లెక్కలం మాష్టారు కావటం అయినందు నేను భయంతో చచ్చిపోవటానికి గల రెండు ముఖ్యకారణాలు. పాంటు తొడుక్కుని, ఫిఫ్తుఫారం చదువుతున్న వాళ్ళని కూడా ఆయన వంగదీసి వీపు మీద గుద్దులుగుద్దేవాడు! తొమ్మిది యింటూ ఏడు ఎంతా అని ఎవరైనా గబుక్కున అడిగినా సరే- కంగారుపడే నేను లెక్కలపేరు చెప్తేనాలు. మైలు దూరం పారిపోయేవాణ్ణి. అందుకే పక్కఇల్లే అయినా ఎప్పుడూ గడప దాటి వాళ్ల ముంగిట్లో అడుగు పెట్టి ఎరగను (గోడ మీంచి దొంగచాటుగా జామకాయలు కోసుకు తినేవాడి నన్నది వేరేవిషయం)

అయితే మానాన్న లెక్కలమేష్టారు కాదు- శ్రీమాలికి లెక్కలంటే భయమూ లేదు గనక ఆమె మాత్రం బడినించి రావటంతోనే ప్రతిరోజూ పరిగెత్తుకుంటూ మాయింటికి వచ్చేసేది. మా అమ్మని అత్తా అనేది నన్నుబావా అనేది. ఏడేళ్లపిల్లే అయినా ఎంతో చురుగ్గా వుండేది- విశాలమయిన కళ్లని చక్రాల్లాతిప్పుతూ కబుర్లు చెప్పేది. ఇద్దరం కల్సి మా దొడ్లో ఆడుకునే వాళ్లం ఆమెతో కల్సి నేను తొక్కుడు బిళ్ళ ఆడేవాణ్ణి- నాతోకల్సి ఆమె కోతి కొమ్మచ్చి ఆడెది

నేను ఎస్సెల్సీ పాసై మా వూళ్లో లేని కాలేజీ చదువు కోసం పొరుగూరు చేరుకోవటంతో శ్రీమాలికి, వూరికి దూరం కాక తప్పలేదు. శలవుల్లో యింటికి వెళ్లినా తొక్కుడు బిళ్ళలూ. కోతికొమ్మచ్చులూ ఆడే వయసు దాటి పొయ్యటం మూలాన శ్రీమాలితో ఆడే అవకాశాలు మిగల్లేదు. ఆవయసుకి ఆడగలిగే ఆట ఒక్కటే- ప్రేమాట. నేను చదువుతున్నది మగాళ్ళ కాలేజీలో గనక శ్రీమాలికి పోటీగా నామనసు (కాలేజీ)లో ఎవరూలేరు

నేను సెకండియర్ డిగ్రీలో వుండగా శ్రీమాలి రూపులో విచిత్రమయిన మార్పులు రావటం మొదలయింది. వేసవి శలవుల్లో వచ్చినప్పుడు నన్ను నేను నిగ్రహించుకోలేక ఆమె వెంటపడటం మొదలుపెట్టాను. ఏదో ఓనెపం మీద ఆమెను తాకటం, చేయి పట్టుకు నొక్కటం, భుజంమీద చెయ్యి వేయటం చేసేవాణ్ణి ఆమె చూసీచూడనట్టు వూరుకునేది

ఫైనలియరంతా నామనసు మనసులో లేదు శ్రీమాలి గుండెల్లో చిక్కుకుపోయి వుంది నాలుగురోజులు శలవొస్తే చాలు వెళ్లి మావూళ్లో వాలేవాణ్ణి. శ్రీమాలిని చూడటంతోనూ, చిలిపి చేష్టలు చేయటంతోనూ నన్నునేను తృప్తిపరుచుకుని, శలవుల్ని గడిపి వెనక్కితిరిగి వచ్చేవాణ్ని

అశని పాతం లాటి వార్త ఫైనలియర్ పరీక్షలు రాసివచ్చిన రోజు తెలి

పోంది- బాలరాజుగారు చనిపోయారు. ఊరికే కాదు గుండె పోటుతో గుండె పోటు ఊరికే రాలేదు శ్రీమాలి మా వూరి పెద్దకాపు కొడుకు శ్రీధర్‌తో లేచిపోయిందన్న వార్త ఆయనకి తెలియడంతోనే వచ్చిందట డాక్టరొచ్చే వ్యవధికూడా లేకుండానే ఆయన పోయినాట్ట కర్మకాండ పూర్తికాగానే ఆయన భార్యని పుట్టింటి వారు తీసుకెళ్ళిపోయారు. పక్కిల్లు- గత శలవులకి నేనొచ్చినపుడు కూడా విరగబూసిన మామిడి చెట్టులా నిండుగా నన్ను పూరిస్తూ గలగల లాడుతూ శ్రీమాలి తిరిగిన పక్క ఇల్లు- ఇవాళ మనిలే మనిషంటూ లేక శ్మశానంలా కనిపించింది.

నాకు తల తిరిగినంత పనయింది. ఎంత ఘోరం జరిగిపోయింది.... శ్రీమాలి శ్రీమాలి.... శ్రీధర్‌తో లేచిపోయిందా ఎందుకంతా పనిచేసింది? ఆమె మీద నేనెన్ని ఆశలు పెట్టుకున్నాను. తను నామీద ఆశలు పెంచుకోలేదా? మరి ఎందుకు తనకంత చనువిచ్చింది?

నాకు పిచ్చెత్తింది. ఎవరికి ఏమని చెప్పుకునేందుకు వీలులేని బాధ! ఒక లేచిపోయినదానికోసం అహరహం క్షోభిస్తున్నానని ఎవరితోనన్నా నవ్వు

తారు హేళన చేస్తారు తప్ప సాను భూతి ఎలా చూపిస్తారు. నా అదృష్టమో దురదృష్టమో మా నాన్నగారికి స్టేషన్ మాస్టర్‌గా ప్రమోషన్ రావటం, ఆ పల్లెటూరునుంచి మరో పెద్దపట్నానికి ట్రాన్స్ఫర్ కావటమూ, సరిగ్గా అప్పుడే జరిగాయి. దాంతో నా మనసుకి దూర మైపోయిండి శ్రీమలి.... క్రమంగా.... క్రమక్రమంగా.

శ్రీమాలిని శ్రీధర్ సవ్యంగా ఏలు తున్నాడా? లేకపోతే శ్రీమాలి భవిష్యత్తు ఏమయింది? ఆమె ఇప్పుడు ఎక్కడ వుంది?

ఈ జవాబు దొరకని ప్రశ్నలు ప్రశ్న లుగానే మిగిలిపోయాయి నాకు. మళ్ళా జన్మలో ఆ వూరివేపు వెళ్ళే అవకాశం నాకు రాకపోవటంతో?

పదేళ్ళకిందటిమాట! ఇన్నేళ్ళకిమళ్ళా కనిపించింది శ్రీమాలి.

అయితే సినిమాల్లో ఎక్స్ట్రా వేషా లేస్తోందన్నమాట! మరి ఆ పెద్దికాపు కొడుకు ఏమైనట్లు? కథ మామూలేనా? మోజు తేరిన వెంటనే అతను శ్రీమాలిని యీ జనారణ్యంలో యీ మాయమయ జగంలో వదిలేసి వెళ్ళిపోయాడా?

శ్రీమాలిని తనని నిజంగానే గుర్తు పట్టలేదా? గుర్తుపట్టకుండా ఎలా వుంటుంది? ఇంపాసిబుల్! అలా నటి స్తోందంతే! తనని ఎదుర్కొనేందుకు మొహం చెల్లటం లేదన్నమాట. సహ జమేగా.

వరసగా రెండు రోజులు గడిచిపో యాయి శ్రీమాలి నాకు మళ్ళీ కనిపిం చలేదు. ఆమెను గురించి ఎవరినైనా ఎంక్వైరీ చేద్దామనిపిస్తోంది. మళ్ళీ-వాళ్ళు ఏమనుకుంటారోనన్న శంక

అసలెందుకు నాలో యీ కలవరం? ఆమె నాకుకనిపించకపోతేనేం? శ్రీమాలి కనిపించకుండా పోయాక దాదాపు రెండు మూడేళ్ళదాక నా మనసు ఆమె గురించి ఆలోచిస్తూనే వుండేది. పరి పి స్తూనే వుంచేది. కానీ, ఆమెను గురిం ఆలోచనలు వెనుక బడి కూడా మూడేళ్ళు దాటుతోంది. గాయం మచ్చగా మారి పోయింది.

మళ్ళా ఇదేమిటి? అనుకోనివిధంగా ఆమె కనిపించగానే మళ్లీ నా మనసులో యీ అలజడి ఏమిటి? ప్రేమ అన్న అర్థం వర్తిస్తుందా యీ అలజడికి! నే నింకా శ్రీమాలిని ప్రేమిస్తూనే వున్నానా?

తనని కాదని మరోవ్యక్తితో లేచి పోయిన మనిషిని ఇంకా తను ప్రేమిస్తు న్నాడా? ప్రేమ గుడ్డిదే కాక సిగ్గులేనిది కూడానా?

కాదేమో- శ్రీమాలి భర్తతో కాపు రంచేసుకుంటూనాన్న కంటపడితే నాలో ఈ అలజడి కలుగకపోయేదేమో. సిని మాల్లో ఏక్స్ట్రా వేషాలేసుకుంటూ



పొట్టపోసుకుంటోందంటే ఆమె ఏ పరిస్థితుల్లో వుందో తేలిగ్గా వూహించుకోవచ్చు ఆ స్థితిలో వున్నందు వల్లనే నాకామె మీద జాలి కలిగిందేమో. అయితే నాలోని కలవరం జాలివల్లకలిగిందేమో. ప్రేమ వల్లకాదా?

ద్వైదీభావంతో బుర్ర తిరిగిపోతుందే తప్ప ఏ నిర్ణయానికి రాలేకపోయాను.

మద్రాసు వచ్చినపని పూర్తయిపోయింది.

"కంగ్రాట్యులేషన్స్ మిస్టర్. కొత్తవాడివయినా చక్కగా రాశావు ఈ సినిమా సక్సెస అయితే సగం కారణం నువ్వే అవుతావు" అన్నారు ఇంద్రప్రసాదుగారు. నాకు గాలిలో తేలిపోతున్నట్టుంది

"అదంతా మీ అభిమానం సార్. నిజానికి మీ చిత్రం ఏది హిట్టయినా అందుకు కారణం నిస్సందేహంగా మీ దర్శకత్వ ప్రతిభే అవుతుంది" అన్నాను

"వినయం భూషణమే గానీ- ఆత్మవిశ్వాసం తోడుగా నున్నప్పుడే అది భాసిస్తుందోయ్." ఇంద్ర ప్రసాద్‌గారి మాటల్లో మెప్పుదలతో పాటుగా మందలింపు కూడా ధ్వనించిందేమో మౌనంగా ఊరికుండి పోయాను.

రేపు ఉదయం ఫ్లయిట్‌కి నాకు టికెట్ బుక్ చేయించి ఇచ్చారు పారితోషికం కూడా ముట్టచెప్పేశారు. సినిమావాళ్ళ గురించి ఏన్నో కథలు విన్న నాకు ఆ కథలన్నీ అబద్దమో- లేక ఇది ఇంద్ర ప్రసాదుగారి ప్రభావమో అర్థం కాలేదు. ఏదేమైతేనేం, నా అదృష్టం బావుంది.

ఆనందంగా అందరి దగ్గర సెలవు తీసుకున్నాను కార్లో ఎక్కి కూర్చున్నాను. కారు స్టూడియో ఆవరణ దాటుతుండగా దూరంగా చెట్లకింద కనిపించింది - శ్రీమాలిని. వెంట మరో నలుగురు- ఎక్స్ట్రాలు కాబోలు యువతులు మరో మగ వ్యక్తి కనిపించారు. కారు ఆపించాను. దిగి వాళ్ళ వయిపు నడిచాను,

శ్రీమాలి నన్ను చూస్తూనే మొహం తిప్పేసుకుంది. నేను ఊరుకోదలచుకోలేదు.

"శ్రీమాలి, నేను రేపుదయమే వెళ్లి పోతున్నాను. ఇప్పుడు కూడా నువ్వు నాతో రావడానికిసిద్ధపడకపోతే మళ్ళానేను నీకుకనిపించే అవకాశం ఇప్పట్లోరాకపో వచ్చు- పశ్చాత్తాపపడతావు ఆ తర్వాత" సీరియస్‌గా చెప్పాను.

శ్రీ మాలి ఏం మాట్లాడలేదు ఆ మగతను, అతణ్ణి ఎక్స్ట్రా ఆర్టిస్టుల సప్లయర్‌గా గుర్తించాను .... ముందుకి వచ్చాడు, నాల్రోజుల క్రితం ఫోటో ప్రోడక్షన్ మేనేజరుతో మాట్లాడుతూ కనిపించాడు

"ఏమిటి సార్ ఏమిటి కథ?" అన్నాడు,

అతణ్ణి చూడగానే నా బుర్రలో ఏదో మెరుపు మెరిసింది అతన్ని దూరంగా తీసికెళ్ళి మాట్లాడాను.

"ప్రస్తుతం అర్జంటు పనేమయినా వుందా?"

"లేదు సార్, చెప్పండి"

"నాతోపాటు లాడ్జికి రాగలవా?"

"అలాగే సార్ ఒక్క నిముషం"- అతను వాళ్ళకేసి వెళ్ళాడు. ఏదో మాట్లాడి మళ్ళా నా దగ్గరికి వచ్చాడు. కార్లో ఎక్కించుకొని లాడ్జికి తీసుకువెళ్ళాను

శ్రీమాలిని గురించి ప్రశ్నించాను. తను నాలుగేళ్ళుగా ఇక్కడే వుంటోంది కాని, అంతకు ముందు సంగతి అతనికి తెలీదుట. వెంట ఎవరూ లేరని చెప్పాడు. అతని బ్రోకరేజిలోనే చిల్లర మల్లర వేషాలు వేస్తుందిట.

ఆమెకీ నాకు మధ్య ఉన్న సాని హిత్యాన్నంతా వివరించాను.

"నా ముందు తను శ్రీమాలికానని దబాయిస్తుంది. నువ్వు నిజం కనుక్కోవాలి" అన్నాను.

ఈ ఏక్స్ట్రాలందరికీ ఇలాంటి కథ ఒకటి వుంటుంది సార్. వాళ్లు యిక్కడికి వచ్చాక అవన్నీ మర్చిపోయి బతక్కటము నేర్చుకుంటారు వాళ్ళనలా బతకనివ్వటమే మంచిది, ఇంకా ఏం మంచి జరగాలని వాళ్ళకి పాత జ్ఞాపకాలు గుర్తుచేసి బాధపెట్టాలి చెప్పండి?"

నేనేం జవాబు చెప్పాలో అర్థం కాలేదు.

"ఇప్పుడు మీ శ్రీమాలిని నేను నిలదీసి నిజం ఒప్పిస్తాను దానివల్ల ఆమెకేం ఒరుగుతుంది? మీకేం లాభం కలుగుతుంది? ఆమె యిప్పుడు వెన్నకి వెళ్తె ఆమె తల్లిగాని మేనమామలు గానీ ఆమెని చేరదీస్తారా? పోనీ.... మీరామెని యిప్పుడు పెళ్లి చేసుకుంటారా- యీ స్థితిలో చూశాక కూడా ? ....

చెప్పండి సార్ చేసుకుంటా నంటే చెప్పండి ఆమెని ఉద్ధరించతలుచుకుంటే చెప్పండి నేను నిజాన్ని విచారించి ఆమె ఎందుకు మీకు మోహం చాటేస్తుందో తేలుస్తాను."

ఆవేశంగా ~ ట్లాడాడు అతను నాకు ఒక్కసారిగా పట్టుదల వచ్చేసింది.

"తప్పకుండా పెళ్లి చేసుకుంటాను. ఇప్పటికింకా నాకు పెళ్లి కాలేదు, శ్రీమాలి సిద్ధపడితే నాకేం అభ్యంతరం లేదు. నా చిన్ననాటి నేస్తం యిలా అయిపోవటం నాకు చాలా బాధగావుంది, ఆమె మనసులో కూడా నేనంటే విరుద్ధభావం ఏమీ వుండివుండక పోవచ్చు. కేవలం గిల్టీగా ఫీలవ్వ బట్టి నాముందు నన్ను గుర్తించనట్టు నటిస్తోంది.

చెప్పు, నువ్వీసాయం చెయ్యగలవా సూటిగా అడిగాను. ఎక్స్ట్రీల బతుకులు చాలా మటుకు యీ సప్లయర్ల చేతుల్లోనే వుంటాయని నాకు తెలుసు,

అతను అయిదు నిముషాల సేపు రూంబాయ్ తెచ్చిన కాఫీసిప్ చేస్తూ ఏం మాట్లాడలేదు, చివరికి అన్నాడు-

"ఈ రోజుల్లో కూడా మీలాంటివాళ్లు వున్నారంటే నాకు చాలా ఆశ్చర్యంగా

వుందిసార్. చేతులెత్తి దణ్ణంపెట్టాలని పిస్తోంది. దేవుడింకా మనుషుల్లో గూడు కట్టుకు నివసిస్తున్నాడు.

ఏమైనాసరే- మీకోసం నేను కష్ట పడతాను. లలితతో మాట్లాతాను, ఒప్పించటానికిప్రయత్నిస్తాను. ఆమె తన జీవితంలోకి అదృష్టాన్ని ఆహ్వానించే పక్షంలో యీసాయంత్రమే మీదగ్గరకు పంపిస్తాను లేదా- దాని ఖర్మానికి దాన్ని వదిలేయండి. నన్ను మనస్ఫూర్తిగా క్షమించండి."

రెండు చేతులూ జోడిస్తూ మాటాడా డతను.

"ఏం ఫర్వాలేదోయ్- నువ్వేం చేస్తావ్? నీ ప్రయత్నం నువ్ చేయ్. ఫలితాన్ని దేవుడికి వదిలేద్దాం" అన్నాను

అతను మళ్లీ నమస్కారం చేసి వెళ్లిపోయాడు.

నాలో టెన్షన్ ప్రారంభమయింది, ఆమె ఏమంటుంది?

o o o

రాత్రి ఎనిమిది గంటలు దాటు తుండగా బజర్ మోగింది, వచ్చింది శ్రీమాలి తలుపుతెరిచి. ఆమెని చూడ గానే నన్ను ఆశ్చర్యం ఆనందం కుదిపే శాయి.

"వచ్చావా శ్రీమాలీ- వస్తావో రావో నని కిందు మీదవుతూ కూర్చున్నాను. వెల్‌కం.." గబగబ అన్నాను.

ఆమె మౌనంగా ఒకడుగు లోపలికి వేసింది,

"రా. కూర్చో., ఏం తీసుకుంటావ్ కాఫియా. కూల్డ్రింకా?" ఆమెమాట్లాడ లేదు,

"మాట్లాడు లలితా" ఓరగా ఆమెని చూస్తూ అన్నాను,

"లలితని కాదు నన్ను క్షమించు రాజూ.." అంతవరకూ పెదాలు బిగ బట్టుకు కూర్చున్న ఆమె ఒక్కసారిగా భోరుమంది.

ఊహించని యీ పరిణామానికి నేను ఉక్కిరిబిక్కిరయ్యాను,

"ఏడవకు శ్రీ ఏడవకు, ఏం మునుగు పోయిందని ఏడుస్తావ్?" ఆమెని ఓదార్చటానికి ప్రయత్నించాను,

"ఏడవనీ రాజూ, ఏడిస్తేగానీ నా గుండె బరువు తగ్గదు, నా పాపం ఎంత ఏడ్చినా ప్రక్షాళితంకాదు," ఏడుస్తూనే జవాబిచ్చింది,

"ఏమయిందసలు? శ్రీధర్ ఏమ య్యాడు?" కానేపటికి ఆమె ఏడుపు ఆపాక అడిగాను,




"ఇప్పుడు నన్నేం ప్రశ్నించొద్దు రాజా. నెమ్మదిమీద అన్నీ నీకే తెలుస్తాయి, అంతేకాని నన్నిలా ప్రశ్నించి ఆ భయంకర జ్ఞాపకాల సుడిగుండాల్లోకి మళ్లీ నెట్టకు. చేయూతనిచ్చి ఒడ్డెక్కించే ప్రయత్నంలో మళ్లీ వెనక్కి తిప్పి నేను దాటివచ్చిన ఆ లోయల్ని చూపించకు. కళ్లుతిరిగి, కాలుజారి నేను మళ్లీ అందులోకే తుళ్లి పడిపోతాను," అంది.

బజర్ నొక్కి బాయ్‌ని పిలిచాను ఇద్దరికే డిన్నరికి ఆర్డరిచ్చాను,

లేచి వెళ్లి మొహం కడుక్కొని డ్రస్ మార్చుకో- కాస్త రిఫ్రెష్ అవు. డిన్నర్ తీసుకుంటే ఎటన్నా బయటకు వెళ్దాం," అన్నాను.

ఆమె భారంగా లేచి, తనతో తెచ్చుకున్న సూట్‌కేసులోంచి చీరె తీసుకుని బాత్‌రూంలోకి వెళ్లింది పదినిముషాల అనంతరం బయటకు వచ్చిన శ్రీమాలి దర్శనం నాకు ఆశ్చర్యాన్ని కల్గించింది. అంతకుముందు కళ్ళకాటుక కరిగేలా ఎదటివాడి గుండెలు కరిగేలా తన స్వంతగుండెలు కమిలేలాఏడ్చిన మనిషి ఈమేనా అని అనుమానం మొలకెత్తేలా మంచు కడిగిన మల్లెపువ్వులా దర్శనమిచ్చింది,

ఇద్దరం కబుర్లతో భోజనం ముగించాం,

"రేపుదయం ఫ్లైట్‌కి టికెట్ వుంది నాకు. అది కాన్సిల్ చేసేసుకుంటాను. ఇద్దరం రేపురాత్రికి బయల్దేరి రైల్లో వెళ్లిపోదాం." అన్నాను, ఆమె అంగీకారంగా తలూపటం నన్ను హిమాలయ శిఖరపు అంచుల్లో నిలబెట్టింది,

"ఏదేనా సెకండ్ షోకి వెళ్దాం" అన్నాను, ఆమె నవ్వుతుంది.

సినిమా చూసివచ్చేసరికి ఒంటిగంట వుతోంది.

నాలుగేళ్లుగా నాలో నివురుగప్పుకు ఆరటానికి సిద్ధంగా వున్న శ్రీమాలిమీద ప్రేమంతా ఆర్తాతి రగిలి ఒక్కసారి భగ్గున మండింది. ఆ మంటలవేడికి నాతనువూ మనసూ కరిగి, వరద వెల్లువగాపారి ఆమెని ముంచెత్తాయి

ం ం ం

విండోగ్లాస్‌లోంచి మీదికి పడుతున్న ఎండ చురచుర లాడిస్తుంటే. నిద్రమెలకువొచ్చింది. కళ్లుతెరిచి చూశాను. ఆరున్నర కావస్తోంది. బద్ధకంగా పక్కకి చూశాను. శ్రీమాలి అప్పటికే లేచింది.

"ఎంతయినా ఆడవాళ్లు ఆడవాళ్లే. పగలూ రాత్రీ మగవాడితో సమంగా కష్టపడ్డా తెల్లవారకముందే లేచి స్నానాదికాలు కానివ్వందే తోచదు."

అనుకుంటూ నవ్వుకున్నాను. బాత్రూం వైపే దృష్టి వుంచా, పూలు కడిగిన ముత్యంలా బయటికి రాబోయే శ్రీమాలి దర్శనం కోసం చూస్తూ.

అయిదు. పది....పావుగంటదాటినా ఆమె బయటికి రాలేదు. ఈ లోగా నాలో ఓ చిలిపి ఆలోచన తలెత్తింది. లేచి. స్లూలుని బాత్రూం తలుపుదగ్గరగా వేసుకుని, వెంటి లేటర్లోంచి లోపలికి తొంగి చూసి విభ్రాంతుణ్ణయ్యాను లోపలి దృశ్యానికి.

బాత్‌రూంలో... నా ... బో యే శ్రీమతి.... లేదు.

ఉలిక్కిపడి కిందకిగెంతాను బాత్‌రూం గదియ బయటి నుంచే వేసివుంది నన్ను వెక్కిరించింది ఆ మాత్రం ముందుగానే గమనించనందుకు నన్ను నేనే తిట్టుకుంటూ చుట్టూ చూశాను.

నా గదిలో శ్రీమాలి సూట్ కేసు గానీ, విడిచిన చీరెగానీ, మరే ఆనవాలు గానీ లేవు.

గబగబ గది అంతా వెదికాను డ్రెసింగ్ మిర్రర్ ముందు పౌడర్ టిన్ కింద వుంది ఆ కాయితం-

"డియర్ కవిరాజా,

ఖర్చంతా కలంలోకి నింపి కాయితాల మీదికి దింపేస్తుంద బట్టేనేమో నీ బుర్ర శూన్యంతో నిండిపోయింది

నేను శ్రీమాలిని కాదన్నాను. నువ్వు నమ్మలేదు. నేను నిజం చెప్తే నువ్వు నమ్మలేదు. ఆబద్ధమాడగానే ఆనందంగా నమ్మేశావ్.

నీ కథ విన్నప్పుడే నాకొక గొప్ప ఐడియా వచ్చింది.

సినిమాల్లో కాదు-యీ కవిగాడి జీవితంలో క్షణేపు నటించు. లాభం.... సగం" అన్నాడు.

అందుకే రాత్రంతా నేను శ్రీమాలిగా అవతార మెత్తింది.

తెల్లవారుతోంది. ఈ నేన చాలించి వెళ్ళిపోతున్నాను.

మొత్తం డబ్బు తీసుకోలేదులే. రెండొందలు వదిలేసి వెళ్తున్నా. విమానం టికెట్ వుండనే వుందిగా. నో నో ప్రాబ్లం ఫర్ యు.

ఈ విషయం రచ్చ చేసుకోకుండా గప్ చిప్‌గా వెళ్ళిపో.

మెమెలానూ తెగించిన వాళ్ళం. ఏ భయం, సిగ్గూలేవు మాకు ఎటొచ్చీ కొత్తగా ఫీల్డులోకి వస్తున్నవాడివి. అదృష్టం బావుంటే నిలదొక్కుకోవలసిన వాడివి. మొదటిసారే కంగు తిన్నావని తెలిస్తే నలుగుర్లో చులకనయిపోతావ్. నువ్వు నిజం చెప్పినా ఎవరూ నమ్మరు. 'కథ బావుంది. మా సినిమాకి పనికొస్తుంది.' అంటారంతే.

ఓ ఎక్స్‌ట్రా అర్థరాత్రివేళ నీగదికి రావటాన్ని, ఎవరేనా "ఆ ఎక్స్‌ట్రా అర్ధరాత్రివేళ నీ గది కెందుకొచ్చింది" అనడుగుతారు. నువ్వు చెప్పే నిజం ఎవరూ నమ్మరు కథగా సినిమాకి పనికొస్తుందంటే గానీ-నిజం మాత్రం కాదు అనేస్తారు.

అంచేత.... అటువంటి ప్రయత్నాల ద్వారా నవ్వులపాలు కాబోకు.

మొదటి సినిమా పారితోషికం నాకు బహుమతి ఇచ్చాననుకో థ్యాంక్స్.

వెళ్ళరా. మళ్ళీ ఎవర్నిచూసి శ్రీమాలి అని భ్రమ పడకు.

ఐతే, చివరిగా ఒక్కమాట—ఆ శ్రీమాలి ఎవరోగానీ అదే ఎన్నికహార్"

ఉత్తరం చివర్న సంతకం కూడా లేదు.

పిచ్చెత్తింది నాకు, నిన్న ప్రొడ్యూసర్ గారు ప్రాంప్ట్‌గా పారితోషికాన్ని ద్రవ్యరూపంలో సమర్పించుకున్నందుకు సంతోషించాను. ఇప్పుడు విచారిస్తున్నాను. మరేం చేయను.

అవతల ఫ్లయిట్ టయిమైపోతోంది. నోరుమూసుకుని గబగబ తయారు కాసాగా

# హంపీ డంపీ

కంఠంనేని రాధాకృష్ణమూర్తి

"వరకట్నం మీద మీ అభిప్రాయమే మిటండీ?"

ఆకాశవాణి తరపునుంచి వచ్చిన పెద్దమనిషి ఆ పూట లేడీస్ క్లబ్‌లో ఇంటర్వ్యూ తీసుకుంటూ టేపుచేసుకుంటున్నాడు.

ఒకసారి దగ్గి గొంతుక సవరించుకుందామె.

ఆ క్లబ్‌కు సెక్రెటరీ - ఆమె పేరు వర్ధనమ్మ.

"వరకట్నమనేది మన సమాజంలో నాటుకు పోయిన ఒక పెద్ద దురాచారమండీ," ఆమె అన్నది. "నానాటికి అది ఊడల్ని పెంచుకుంటూ సమాజమంతటినీ ఆక్రమించుకుని తన వాడి కోరలతో అనేక మంది అమాయిక అబలల్ని బలితీసుకుంటోంది...."

ఓ మారు చుట్టూ పరికించి చూసిందామె, తన చెలులవేపు, ఇంటర్వ్యూ తీసుకుంటున్న పెద్దమనిషి వేపూ

అంతా మెచ్చుకోలుగా చూస్తున్నారు,

ఆమెకి నలభై అయిదేళ్ళుంటాయి. బక్కగా పొడుగ్గా ఉన్నది. తల మీద




వెంట్రుకలు అక్కడక్కడా మెరిశాయి

"ఈ వరకట్నాన్ని రూపుమాపటములో ఒక్క ప్రభుత్వానికి మాత్రమే బాధ్యత ఉందనుకుంటే అది సంకుచితమవుతుంది..." ఆమె మళ్ళీ అన్నది

ఇంటర్వ్యూ తీసుకుంటున్న అతని కళ్లు తళుక్కున మెరిశాయి వీలయినంతలో ప్రభుత్వాన్ని విమర్శించే స్టేట్‌మెంట్లు ఇంటర్వ్యూలలో లేకుండా ఉండేట్లు చూసుకోవాలి అతను. ఒకవేళ అవి ప్రభుత్వాన్ని సమర్థించేవిగా ఉంటే మరీ మంచిది,

"ఊఁ, ఇంకా చెప్పండి!" ఉత్సాహంగా ముందుకు వంగి అన్నాడు.

"సమాజంలో ఉన్న ప్రతి వ్యక్తి తనో డాక్టరు గానూ, వరకట్నాన్ని రుగ్మతగానూ భావించి బాధ్యతాయుతంగా ప్రవర్తిస్తే ఈ సమస్య చాలా త్వరగా సమసి పోతుందండీ."

మహిళా మెంబర్లంతా ఒక్కసారి చప్పట్లు చరిచారు

"ఇంకేమైనా పరిష్కార మార్గాలు సూచించగలరాండీ?" అడిగాడతను

"మన చట్టాల్ని కూడా మరికొంచెము మార్చుకోవాలండీ. ఈ బాపతు నేరాలకి ఆ వరుణ్ణీ అతడి తల్లిదండ్రులని నడి బజారులో నిలబెట్టి కాల్చిపారేసేలాంటి శిక్షలు నిర్దేశించబడాలి ...."

మళ్ళీ చప్పట్లు.

"అంటే అరబ్బు దేశాల తరహాలో నంటారు?"

"అవునండీ, నా అభిప్రాయం అదే"

"అంతే కాదండి మరో మహిళామణి అన్నది. "ఇప్పుడు షెడ్యూల్డు కులాల వాళ్ళకు ఇస్తున్న రీతిలో ఆడపిల్లలకు ప్రభుత్వం కొన్ని రిజర్వేషన్ల రాయితీలని కల్పించాలి. రిజర్వేషన్లు ఉద్యోగాల విషయాల్లో అయితే రాయితీలు ఆడపెళ్ళి సమయంలో కొంత డబ్బు ముట్ట చెప్పటం రూపంలో...."

"అసలదీ కాదు," మరోకామె అందుకుంది. "ఈ కట్నమనేది ఆడపిల్లవాళ్ళు మగపిల్ల వాళ్ళకు ఇచ్చుకోవటము కాకుండా వరుడే పెళ్ళికూతురికి ఇచ్చుకునేటట్లుగా వుండాలి."

"కాని ఇది మళ్ళీ కట్నంలోకే వస్తున్నట్టే కదా?" నవ్వుతూ అడిగాడతను.

"రావండి," ఆవేశంగా అన్నది [illegible].

"తరతరాలనుంచి స్త్రీకి జరిగిన అన్యాయానికి పురుషుడు ఆ మాత్రాన్ని కొన్నాళ్ళవరకు భరించక తప్పదు!"

"కరెక్ట్, కరెక్ట్!!"

"సరిగ్గా చెప్పారు!"

చప్పటే చప్పట్లు....

o o o

సోఫాలో కూర్చుని తల వెనక్కి వాల్చి అలసిపోయినట్టుగా కళ్ళు మూసుకుంది వర్ధనమ్మ. ఆనందము, ఏదో ఉత్సాహమూ, తృప్తి ఆమె మనసు నిండా ఆవరించుకున్నాయి....

పరిపూర్ణ జీవితం తనది. మగడిది పెద్ద ఆఫీసరు ఉద్యోగం, అంత పెద్ద ఆఫీసరూ తన చెప్పుచేతల్లో ఉంటున్నాడు. ఒకోసారి ఆయన కింద పని చేసే ఉద్యోగుల్ని ఇంటికి పిలిపించి రిమాండ్ చేస్తూ ఉంటుంది నేరుగా. ఆయనకంటే తనను చూసి భయపడుతుంటారు వాళ్లు ఎక్కువగా.





# నోటి దుర్వాసన పోగొట్టుకోండి...
# దంత క్షయాన్ని ఎదుర్కోండి.




కోల్గేట్ తాలూకు నమ్మకమైన ఫార్ములా మీ నోటి శ్వాస శుభ్రంగా, తాజాగా వుండేలా చేస్తుంది...
మీ పళ్లు ఆరోగ్యంగా, దృఢంగా వుండేలా చేస్తుంది.

ఎలాగో చూడండి:



మీ పళ్లలో చిక్కుకుపోయిన ఆహారపు తునకల్లో దుర్వాసన, దంతక్షయం కలిగించే సూక్ష్మజీవులు పెరుగుతాయి.



కోల్గేట్‌లోని అద్వితీయమైన శక్తి గల నురుగు లోతుగా చొచ్చుకుపోయి, హానికరమైన ఆహారపు తునకలనీ, సూక్ష్మజీవులనీ తొలగిస్తుంది.



ఫలితం: ఆత్మవిశ్వాసాన్నిచ్చే తాజా శ్వాస, దంతక్షయం నుంచి రక్షణ, ఆరోగ్యమైన గట్టి పళ్లు.

గుర్తుంచుకోండి, ప్రతిసారి భోజనం కాగానే కోల్గేట్ డెంటల్ క్రీమ్‌తో పళ్లు బ్రష్ చేసుకోండి. నోటి దుర్వాసన పోగొట్టుకోండి...దంతక్షయాన్ని ఎదుర్కోండి.

**దీని తాజా పిప్పరమెంట్ రుచి మీ కెంతో నచ్చుతుంది!**

GKBE.882 86 TL

సన్నగా నవ్వుకుందామె.

లేడీస్ క్లబ్ తరపున ఆమె తరచుగా సాంస్కృతిక కార్యక్రమాలని నిర్వహిస్తుంటుంది. ఎక్కడ చూసినా తనేఅయి కనిపిస్తుంటుంది. సమాజంలో పురుషుడి ఆధిక్యత గురించి స్టేజిమీద ఆవేశంగా ఉపన్యాసాలిస్తుంటుంది.

ఆవేళ రేడియో ఇంటర్వ్యూలో తను అన్న మాటలని మరోమారు గుర్తుతెచ్చుకుందామె కొద్దిగాగర్వాన్ని ఫీలయింది ఆ ప్రోగ్రాము వచ్చేనాడు రేడియోను తప్పక సరిగా వినాలి. తన స్వరం ఎట్లా వచ్చిందో రేడియోలో తన ఆవేశం ఎట్లా ప్రతిఫలించిందో....

సడన్‌గా ఆమెకు సుశీల గుర్తుకొచ్చింది.

లేడీస్ క్లబ్బులో సుశీల కూడా ఒక మెంబరు. ఏదో కాలేజీ చదువులు వెలగబెట్టింది ఒక యర్రీసీ భార్య. కాని ఎంత టెక్కని!? మిగతా మహిళా మెంబర్లంతా తమ భర్తల తాలూకు దానితత్వాన్ని క్లబ్బులో ప్రతిఫలింపజేస్తూ చాటున ఎట్లా చెప్పలు కొరుక్కున్నాగాని తన ఎదురున మట్టుకి అణిగి మణిగి ఉంటూ తమ పబ్బాల్ని గడుపుకో చూస్తుంటే ఈ పిల్లమాత్రం అట్లాకాదు. ఎవరినీ లెక్కచేయదు. తనతో నే చాలాసార్లు వాదనలకు దిగింది అందుకే తనకా పిల్లంటే మంట. మెల్లగా ఈయనతో చెప్పి దాని మొగుడిని ఇక్కడనుంచి ట్రాన్స్‌ఫర్ చేయించాలి....

ఈమె ఇట్లా ఆలోచనల్లో ఉన్న సమయాన పొట్టిగా, లావుగా, ఇంత పెద్ద పొట్టతో ఉన్న ఒక వ్యక్తి నెమ్మదిగా లోపలికి ప్రవేశించాడు ఆమె ఆలోచనలకు ఎక్కడ భంగం కలుగుతుందోనన్నట్లుగా మెల్లగా నడుచుకుంటూవచ్చి ఆమె కెదురుగా వున్న సోఫాలో కూర్చున్నాడు.

అతను ఆమె భర్త!

ఆమె మొహంలోకి చూస్తూ కొద్దిసేపు అట్లా కూర్చున్నాడతను, ఆమె కళ్ళెప్పుడు తెరుస్తుందా అని ఎదురు చూస్తున్నటుగా ఉందతని వాలకం.

"ఏమన్నారు వాళ్ళు!"

ఖంగుమంటూ వినిపించిన ఆమె స్వరానికి ఉలికిపడ్డాడతను

"నలభయి వేలవరకూ ఇవ్వగలమంటున్నారు" నెమ్మదిగా చెప్పాడు

చటుక్కున కళ్లు తెరిచిందామె.

"మీరేమన్నారు?" తీక్షణంగా చూసిందామె

"ఏమంటారు, వప్పుకునేవుంటారు" మళ్ళీ తనే అన్నది వ్యంగంగా.

"లేదు లేదు" అతనన్నాడు "ఆలోచించి మళ్లీ చెబుతానన్నాను."

# సూపర్ రిన్‌తో
# తళతళలాడే తెలుపు

**మరే ఇతర డిటర్జెంట్ బిళ్ల లేదా బార్ కంటే తెలుపు.**




నిజానికి ఆ తేడా మీ కళ్లే మీకు తేల్చి చూపిస్తాయి. మరి సూపర్ రిన్‌తో ఉతికిన బట్టలకి, మరే యితర డిటర్జెంట్ బిళ్ళ లేదా బార్ కన్నా కొట్టొచ్చేలాంటి ఆ మరింత తెల్లని తెలుపు వస్తుంది. కారణం ఏమిటంటే, సూపర్ రిన్‌లో మరింతగా తెలుపు చేసే శక్తి ఉంది. మీ బట్టలకి ఎంత తెలుపు వస్తుందంటే చూసేవాళ్ళ కళ్ళు మిరిమిట్లు గొలుపుతాయిక.



హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

"ఇందులో ఆలోచించటానికి ఏము న్నదని?" కోపంగా అన్నదామె "వేలకు వేలు పోసి పిల్లవాడిని మెడిసిన్ చది వించింది వాళ్ళమ్మాయికి వేరుగా కట్ట పెట్టటానికనా, ఆ చదువుకయిన ఖర్చుని మనం మళ్ళీ రాబట్టుకోవద్దా? వాడి చదువు ద్వారా వచ్చిన సంపాదనతో రేపు సుఖపడేది మన అబ్బాయి ఒక్కడే కాదు కదా! వాళ్ళ అమ్మాయి సుఖపడక అనుభవించదా? ఏదేం కాదు చెబుతున్నాను వినండి-అరవై వేలకు ఒక్క పైసా తక్కువైనా వప్పుకో వద్దు. అట్లాకాక వప్పుకున్నారంటే మాత్రం నేను ఉరి పెట్టుకోవటం న్యాయం"

"సరే సరే" అతను లేచి నిలుచు న్నాడు.

నిమ్మళంగా నడుచుకుంటూ పోయి మెట్లెక్కుతున్న భర్త వైపు అలా చూస్తూ కూర్చుండిపోయింది ఆమె అతను పై మెట్టు ఎక్కబోతూండగా ఆమె మళ్ళీ కేకేసింది.

"నేను చెప్పింది గుర్తుంచుకున్నారు కదూ?"

అతను ఆగి వెనక్కు తిరిగి చూశాడు.

"విన్నాను వర్ధనం అరవై వేలకు పైసా తక్కువయినా వప్పుకోను"

తృప్తిగా తల పంకించిందామె మళ్ళీ వెనక్కు వాలి కళ్ళు మూసుకుంది

హఠాత్తుగా ఆమెకు ఆ వేళ రేడియో ఇంటర్వ్యూ గుర్తుకొచ్చింది. వర కట్నం నిరసిస్తూ తను మాట్లాడిన మాటలు గుర్తుకొచ్చాయి. అదే సమ యాన ఆమె కళ్ళముందు సుశీల మెరి లింది. రేపు తన కొడుక్కు పెళ్ళయాక సుశీల అందరిముందూ తనను అడ క్కుండా ఉంటుందా?"

"కట్నం తీసుకోకూడదంటు ఆ రోజు మీరు రేడియో ఇంటర్వ్యూలలో చెప్పారు, మరి మీ అబ్బాయికి ఎట్లా తీసుకున్నారు?"

-అని అడిగితే?

అవునవును అడుగుతుంది. తప్ప కుండా అడుగుతుంది. ఓర్వలేని ముండ-

ఈ ఆలోచన రాగానే ఆమె చాలా సేపు అసీజీగా కలయింది.....

ఆ రాత్రి పక్కమీదకు చేరేవరకు కూడా ఆ అశాంతి నుంచి తప్పించుకో లేకపోయింది. ఆఖర్న నిద్రపట్టబోయే ముందు తనకు తట్టిన ఒక సమాధా నికి ఆమె తృప్తిగా నిట్టూర్చింది.

ఆ సమాధానం ఇదీ-అట్లాంటి ప్రశ్న లకు తనీరీతిగా సమాధానం చెబుతుంది

"మేము తెలుసుకదమ్మా ఈయన కెంత చాదస్తమో! మా వాడికి పెళ్ళి చెయ్యకుండానన్నా ఉంటానన్నాడుగానీ అరవై వేలు కట్నం తీసుకోకుండా మాత్రం ఉండనన్నాడు అయినా మీకు తెలియనిది ఏముందమ్మా, ఆడది జయ టన్ని తెలివైన కబుర్లు చెప్పినా ఇంట్లో కెళ్ళేసరికి మాత్రం మగడి ఆలోచన లకే, నిర్ణయాలకే తలవొగ్గాల్సి వస్తోంది ఇదిగో, ఈ పరిస్థితే మారాలని నేను మొదటి నుంచి మొత్తుకుంటోంది...."

సెభాష్!!

ఆ తర్వాత ఆమె హాయిగా నిద్ర పోయింది.



# ఇంక్రిమెంటాలిటీ



## ఉభయ తారక మంత్రాలు :

మన స్తత్వాలు అనేకవిధాలు. గవర్నమెంటాలిటీ, డిపార్టు మెంటాలిటీ, ఆర్గ్యుమెంటాలిటీ...కాని ఇంక్రిమెంటాలిటీలో ఒక విశేషం వుంది. ఇది యజమానికి, ఉద్యోగికి కూడా వర్తిస్తుంది. ఇంక్రిమెంట్ కూడదని వీరికి, ఇవ్వాలని వారికి. ఇది నిరంతర ధ్యాయం.

ఒకరినొకరు జయించే ఉపాయాలు ఈ తరువాత పుటలలో వున్నాయి. మా పత్రిక కొన్నవారికే ఇవి పనిచేయవచ్చు.

# ప్లేటుకి రెండో వేపు

## యజమానులకు మాత్రమే

వెనక పేజీలలో చెప్పిన చిట్కాలు మీచేత ఇంక్రిమెంట్లు ఇప్పించడానికేనని అపోహపడి, మా కేసి చిల్లుల కిటికీలోంచి చూసి "మోహన్ !" అని మా పత్రిక చందా రద్దు చేయకండి. అవి కేవలం ట్రిక్కులేనని మీరు పసిగట్టడానికి వీలుగా వేసినవి. ఉద్యోగుల ఇంక్రిమెంటాలిటీ అణచడానికి విరుగుడు చిట్కాలు ఇవిగో:



ఇతనికి ఇంక్రిమెంటు చాలా అవసరం అనిపించేటంత దీనస్థితిలో వున్న ఉద్యోగిని తరుచు మీ గదిలోకి పిలిచి, అతడు నోరెత్తేలోగా, మీ హీనస్థితిని వెళ్లబోసుకుని కంపెనీ నష్టంమీద నడుస్తోందని ఘోరు మనండి. కంపెనీ తాలూకు పెద్ద రహస్యాలు తనతో చర్చించినందుకు అతడు మురిసిపోయి కాలరెత్తుకుని సంతోషంగా తిరుగుతాడు [ధోకాలేదు.]




సమ్మె కడతారనే ప్రమాదముండే, వ్యాపారం బాగులేనందువల్ల కొందరిని తగ్గించదలచామనండి. దీన్ని రిట్రెంచి మెంటాలిటీ అంటారు. ఆ దెబ్బతో తగ్గిపోతారు [తక్షణం సమ్మె కట్టే ప్రమాదం వుంది, జాగ్రత్త]




బోనసు ఇచ్చిచూడండి. ఇంక్రిమెంటుకన్న ఇది చవక. [తమకు బోనసేమిటి ?] కొన్నేళ్ళపాటు కిమ్మనరు. [ఆ డబ్బు చేతపట్టుకుని ఇమ్మంటే ప్రమాదం వున్నది జాగ్రత్త.]

# గుమాస్తత్వం



యజమానిలో పితృవాత్సల్యం కలిగించో, జాలిగొలిపో సాధించడానికిగాను మాసినవీ, మాసికలు వేసినవీ బట్టలు [ఆర్ట్ డైరెక్టర్ల సలహా పొందండి] వేసుకుని, సినిమాలో నేపథ్యంపు 'శాడ్ సాంగ్' కి ఓప హీరో నటనలా తిరగండి. ఆయన గుండె కరిగిపోవచ్చు [బట్టలు బాగులేకపోతే డిస్మిస్ చేస్తాను అనే ప్రమాదం వుంది, జాగ్రత్త]



సేవాపరాయణత : యజమాని లేనప్పుడు బల్లమీద పిన్నులు కిందపడేసి, ఆయన ఇంకో క్షణానికి వస్తున్నాడనగానే, అవన్నీ ఏరి శ్రద్ధగా పిన్ కుషన్ కి గుచ్చుతూ కంటపడండి. ఆయన మురిసిపోవచ్చు [నౌకర్లపని నీకెందుకు. నీపని నువ్వుచూసుకో అనే ప్రమాదంవుంది, జాగ్రత్త.]



అయిదో, పదో అప్పోసప్పో దొరికినప్పుడు బజారుకెళ్ళి కూరలు, పళ్ళు బుట్టలనిండా కొనేసి యజమాని కివ్వండి. "మా తోటలోవేలెండి" అని చెప్పడం మరచిపోకండి. [మీకు కూరలు, పళ్ళు పండేపాటి తోటవుంటే ఇంక్రిమెంటు దేనికని యజమాని నవ్వేసే ప్రమాదం వుంది, జాగ్రత్త]



యజమాని విట్టేసినప్పుడు [ఆయన చిరునవ్వుతో మాట్లాడినట్టుంటే అది విట్టే] గొల్లున నవ్వి కిందపడి దొర్లండి. ఆయన మీ సెన్సాఫ్ హ్యూమర్ కి మురిసిపోతాడు. [మీరు తనని హేళన చేస్తున్నారని కోపగించే ప్రమాదం వుంది, జాగ్రత్త.]



యజమాని ఇంటికి వెళ్ళే సమయానికి బోయ్‌ని పిలిచి కాఫీ తాగమని డబ్బిచ్చి పంపేయండి. ఆయన ఫైళ్ళు, ఫ్లాస్కు తీసుకెళ్ళి కారులో పడెయ్యండి. ఆయన బోయ్‌ని తిట్టి మీ జీతం పెంచవచ్చు. [మిమ్మల్ని పర్సనల్ అటెండెంట్‌గా ప్రమోట్ చేసే ప్రమాదంవుంది, జాగ్రత్త]



ఆదివారాలు శ్రీవారింటికెళ్ళి పిల్లలతో పసివాడిలా ఆడుకోండి. వాళ్ళని ఎత్తుకుని ముద్దాడండి. మీ ఖర్చులు మానినా ఫరవాలేదు, మరీ మంచిది. [ప్రతిరోజూ పొద్దున, సాయంత్రం వచ్చి పిల్లల్ని ఆడించమనే ప్రమాదం, అలా రానిరోజున చివాట్లేసే ప్రమాదం వుంది, జాగ్రత్త.]



యజమాని మొండిఘటమై, మీ అభినయం, అతి వినయం అన్నీ వృథా అయిపోతుంటే — ఇహ తెగించి అడిగెయ్యండి: "అయ్యా! ఇంక్రిమెంటు కావాలి" అని. ఇవ్వొచ్చు [ఇవ్వకపోయే ప్రమాదం వుంది, జాగ్రత్త.]



మీరు ఎంత తాపత్రయపడ్డా ఇవ్వనిపక్షంలో మీరు తీసుకోబోయే ఎడ్వాన్సుమీద అప్పుచేసి భగవద్గీత కొనండి. గీతలో కృష్ణుడు చెప్పిన మహా వాక్యం — "కర్మణ్యేవాధికారస్తే — —" [కర్మ నీది, ఫలితం నాది] అనేది యజమాని ఎదట లోపల, యజమాని చాటున బయట మననం చేసుకుంటూ, ఇది నా గీత అనుకుంటూ, అప్పులు చేసు కుంటుకుంటూ నడవండి.




ఎందుకొచ్చిన గొడవ, ఇంక్రిమెంటు ఇచ్చెయ్యండి. అలా తప్పని సరి అయి ఇస్తే ఎగుడు దిగుడుగా యివ్వండి. పక్షపాతం చూపండి. ఐదారేళ్ళపాటు ఇంక్రిమెంటాలిటీ తలెత్తకుండా ఇది టీకాల మల్లే పని చేస్తుంది.

---

## గమనిక

ఇంతవరకు మీరు చదివినది ఉగాదినాడు మీ ఉబుసుపోకకోసం రాసిన అభూత కల్పన. అంతేకాని, నిజంగా ఇలాంటివి జరుగుతాయని కాదు. పొరపాటున ఇందులోంచి గుమ్మడికాయ లేవైనా వాటంత టవి ఎగిరిపడితే పక్కవాళ్ల బుజాలు తడవండి.

# రెక్సోనా మీ చర్మాన్ని సంరక్షిస్తుంది...





# మృదువుగా మెరిసేలా ఉంచుతుంది

**రెక్సోనాలో ఉంది సహజసిద్ధమైన**
**నాలుగు నూనెల సమ్మేళనం—**

హాపుషా (దేవదారు జాతి), లవంగ పట్ట, లవంగ, సరళం.
రెక్సోనాతో స్నానం
చర్మాన్ని మృదువుగా
మెరిసేలా ఉంచుతుంది.
మీరెంతో ఇష్టపడే
పరిమళాన్ని చర్మంపై
నిలిపి గుబాళింపజేసే
రెక్సోనా మీ చర్మ
సంరక్షణ కోసం
సహజమైన సాధనం.




# రెక్సోనా మీ చర్మ సౌందర్యం కోసం

హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి

లింటాస్-RX.78-1710 TL

# శ్రీ శ్రీ పదబంధ ప్రహేళిక-5




### ఆధారాలు

అడ్డము :

2. అప్పిచ్చువారు. 5 పాతకాలపు రూపాయలు. 7. పోరు 9. మన వడీ సగం కట్టు 11. అతిశయోక్తికి ఆరంభం. 12. వచన కవితని పుట్టిదించింది 13 నలుగురు బుద్ధిమంతులు (మూడక్షరాలు కలగలుపు) 15. చూ. 4. ; 17. కారాగృహమా, 18 వాక్యానికిచివర 19. అంటే ఇప్పుకున్నట్టే 21 -లేని భారతమా? 23. కలవారి 16 లో తలకిందైనపువ్వు, 24. మనకవి (గకారంలేదు) 26. మయునికీ 2 అడ్డం అనవసరం 27. చూడు 6 నిలువు 29. ఒకప్పుడు లంకలో, ప్రిన్సాఫ్ వేల్స 30. ఊరికే తిరగడం.

మిసి కథల పోటీలో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ.

# గుండ్రబిళ్ల

## పి. శ్రీనివాస శాస్త్రి

"ధరలూ! ధరలూ! మీరెందుకలా పెరిగిపోతున్నారు?"

"కారణం పాలకులు"

"పాలకులూ! పాలకులూ మీరు ధరలెందుకు తగ్గించడం లేదు?"

"కారణం ద్రవ్యోల్బణం"

"ద్రవ్యోల్బణమా! ద్రవ్యోల్బణమా నువ్వెందుకలా బలిసి పోతున్నావ్"

"కారణం గుప్త ధనం"

"గుప్త ధనమా! గుప్త ధనమా! నువ్వెందుకు చావటంలేదు"

"కారణం గుత్త పెట్టుబడిదారులు"

"గుత్త పెట్టుబడిదారులూ గుత్త పెట్టుబడిదారులూ! మీరెందుకు గుప్తధనం మేటలు వేస్తున్నారు,"

"కారణం పరపతి విధానంలో లోపాలు"

"పరపతి విధానం! పరపతి విధానం నువ్వెందుకు లోపాలు కోపాలతో ఉన్నావ్!"

"కారణం బ్యాంకులు"

"బ్యాంకులూ! బ్యాంకులూ! మీరెందుకలా పరపతి విధానం బిగ పెట్టుక్కూర్చున్నారూ"

"కారణం అంతర్జాతీయ ఆర్థిక పరిస్థితులు"

"అంతర్జాతీయ ఆర్థిక పరిస్థితులూ, అంతర్జాతీయ ఆర్థిక పరిస్థితులూ మీరెప్పుడూ బాగుపడరేం"

"కారణం-ఐ. ఎమ్. ఎఫ్, వరల్డ్ బ్యాంక్ వగైరా అంతర్జాతీయ ఆర్థిక సహాయ సంస్థలు-"

"అంతర్జాతీయ ఆర్థిక సహాయ సంస్థలు, అంతర్జాతీయ ఆర్థిక సహాయ సంస్థలూ, మీరెందుకలా చెలగాటాలాడుతున్నారు?"

"కారణం అమెరికా"

"అమెరికా అమెరికా నీ కెందుకీ దుర్బుద్ధీ"

"కారణం -రష్యా-"

"రష్యా రష్యా నీ కివేం పొయ్యేకాలం?"

"కారణం- అమెరికా"

"అమెరికా, అమెరికా నికదేం రోగం"




"కారణం- రష్యా-"

"రష్యా, రష్యా నీకిదేం సర్దా"

"కారణం అమె..."

"............"

"............"

ఇలా వీడని వాడూ వాడని వీడూ. మరొకడని ఇంకొకడూ .. ఇంకొకడని వేరొకడు వేరొకడని ఇదే .. ఇవని అదే. అదని ఇదీ.... ఇదనీ....

ఆ.... ఆహా భూమి గుండ్రంగా వుంది.!!

ఏ సమస్యకైనా భూమి గుండ్రంగానే ఉంది !!!




-జరుగుతున్న కథ-

'ట్రింగ్'

సుదర్శన్ నెత్తిమీద మొట్టినట్టుగా ఫోన్ మోగింది. ఉలిక్కిపడి లేచాడు సుదర్శన్.

"సుదర్శన్ స్పీకింగ్"

"ఆనందరావు హియర్"

ఆ గొంతు వినడంతో ఎలర్ట్‌గా అయి "యస్ సర్" అన్నాడు.

"ఏమన్నా తెలిసిందా"

"కొంత వరకు ప్రయత్నించాము........ ....." జరిగింది చెప్పాడు.

"సార్ ఆ ఇంట్లో మనుషులు కాస్త చిత్రంగా ఉన్నారు. కాని అబ్బాయి మాత్రం చాలా బాగున్నాడు. సిరి సంపదలకు లోటులేదు. ఇంకా వివరాలు పూర్తిగా తెలుసుకుంటాను"

ఆ మాటలు విన్న ఆనందరావు ఒక్క క్షణం ఆలోచించాడు.

"థ్యాంక్స్ సుదర్శన్, ఇక నువ్వు వాళ్ళని కలుసుకోవద్దు. పరోక్షంగా ఏదేనా సమాచారం తెలిస్తే సేకరించు నేను మళ్ళీ ఫోన్ చేసి ఏం చెయ్యాలో చెప్తాను."

"సరే సార్"

సుదర్శన్‌కి ఓ విషయం అర్థం కాలేదు.

"ఇక మీదట వాళ్ళని కలుసుకోవద్దు" అని ఆయన తన నెందుకూ వారిం

**జరిగిన కథ**

**కంప్యూటర్ పెళ్ళికొడుకు వేటలో సుదర్శన్, వెంకటరావు ఆడ్రస్ పుచ్చుకుని జయప్రకాశ్‌నగర్ వేటలో ఆటోలో తిరిగి నానా ఖంగాళీ అయి చేరారు....వరుడి ఇంటికి. ఎటొచ్చీ ఆయన ఇంట్లో లేడు. లక్ష్మి ఆలోచనలో ప్రకాష్ ఆలోచనలు వేరేగా వుండటం....చిత్రంగావుంది సదాశివరావుకి.**

---

చాడు. తను చేసిన దాని పట్ల తృప్తి పడలేదా? లేక దీన్ని డ్రాప్ చేస్తున్నాడా? అదీ కాకపోతే ఆయనే ఈ విషయం స్వయంగా చూసుకుంటాడా?

ఏమైనా పెద్దవాళ్ళ విషయాల్లో జాగ్రత్తగా వ్యవహరించడం మంచిది.

# 7

పరబ్రహ్మం ఇంట్లో ఫోన్ మోగింది.

కుర్చీలో కళ్ళుమూసుకుని కునికిపాట్లు పడుతున్న పరబ్రహ్మం విసుగ్గా ఫోన్ అందుకున్నాడు.

'నేను' ఆనందరావుని మాట్లాడుతున్నాను" అవతలగొంతు పలికింది.

"ఏమిటి విశేషాలు"

"హైదరాబాద్‌లో మన బ్రాంచ్ మేనేజర్ ఆ ప్రకాశ్ అనే కుర్రాడి గురించి కొన్ని వివరాలు సేకరించడానికి ప్రయత్నించాడు."

"కంగ్రాచ్యులేషన్స్"

"ఇప్పుడేకాదు. పూర్తిగా విన్నాక చెప్పు"

ఫోన్లో సుదర్శన్ చెప్పిన విషయాలు పూసగుచ్చినట్లు చెప్పాడు ఆనందరావు. "సుదర్శన్ చెప్పిందాన్నిబట్టి వాళ్ళంతా చిత్రమైన మనుషుల్లా కనిపిస్తున్నారు. సలహా చెప్పడానికి ప్రపంచంలో ఎవరూ దొరకనట్లు నీ కంప్యూటర్ దగ్గరకొస్తే అది ఓ కొరకరాని కొయ్యని సజెస్ట్ చేసింది నేను ఈ ప్రపోజల్ డ్రాప్ చేద్దా మనుకుంటున్నాను." అని ముగించాడు.

"నో. నో....అలా తొందరపడితే ఎలా. ఇంతవరకు బుద్ధిమంతులు అనబడే కుర్రాళ్ళని ఎందర్నో నేను చూసాను. నువ్వు చూసావు. స్వప్న చూసింది. ఏం లాభం. ఇంతవరకు స్వప్నకి ఎవరూ నచ్చలేదు. చూడబోతే ఈ కుర్రాడిలో ఏదో స్పెషాలిటీ ఉన్నట్టు కనిపిస్తోంది. నీకు కొరకరాని కొయ్యలా ఉన్నవాడు స్వప్నకి ఐస్‌క్రీంలా ఉండొచ్చు. స్వప్నకూడా అతన్ని చూసి ఆ తర్వాత ఆ మాట అంటే ఒప్పుకుంటాను. అంతేకాని నువ్వే కొట్టి పడేస్తే ఎలా? పట్టుదల చూపిస్తే ఫలితం ఉంటుందని నా నమ్మకం. నీకు నా సహాయం కావాలంటే నేను చేస్తాను"

"చాల్చాలు. నీ కాలేజ్ ఆఫ్ ప్రేమిస్ట్రీ, సైకో ఎనాలిసిస్ కంప్యూటర్లు—వీటన్నింటికి గుడ్‌బై. నేను ఎవరో నాకు తోచిన వాడ్ని తీసుకొచ్చి స్వప్నకి చూపిస్తాను" ఆనందరావు ఫోన్ పెట్టెయ్యబోయాడు.

"హలో తొందర పడకు....నేను దగ్గరుండి నడిపిస్తాను నేను చెప్పినట్టు చెయ్యి."

"ఏం చెయ్యమంటావు" అడిగాడు ఆనందరావు.

"సాయంత్రం నా దగ్గరకి రా"

ఆనందరావు ఫోన్ పెట్టేశాడు.

సాయంత్రం ఆరున్నర.

లక్ష్మీ నిలయం గేటు తెరుచుకుంది.

ఎదురుగా కిళ్ళీ కొట్టు దగ్గర నిలబడి పాన్ నములుతున్న పరబ్రహ్మం ఆ చప్పుడు విని అటు వైపు చూసాడు. తెల్లటి లాల్చి పైజామా వేసుకున్న షుమారు పాతికేళ్ళ కుర్రాడు బయటకు వచ్చాడు.

కుడివైపుగా తిరిగి తిన్నగా నడవసాగాడు.

అతని కోసమే ఎదురు చూస్తున్న పరబ్రహ్మం 'గుడ్' అనుకుని అతన్ని ఫోలో అయ్యాడు. అతను తిన్నగా నడిచి తను రోజూ కూర్చునే ఎత్తు గుట్ట మీద కూర్చుని ఎదురుగా పల్లంలో కనిపిస్తున్న సిటీని చూస్తూ ఆలోచిస్తూ జేబులోంచి సిగరెట్ తీసి అంటించాడు.

"మాస్టారూ ఓ సారి లైటర్ ఇస్తారా" అదనుకోసం ఎదురుచూస్తున్న పరబ్రహ్మం అడిగాడు. అంత నిశ్శబ్దంలో వెనకనుంచి వినపడ్డ ఆ మాటలకి

అటుగటుగునా
గుండాల గుండెలపై
పిడుగులు రాల్చిన
ఓ.యస్.పి.
పృథ్వీరాజ్
కథ!

తప్పక చూడండి!

లక్ష్మీ ప్రొడక్షన్స్

# ముగ్గురు మొనగాళ్లు

నిర్మాత
ఎ. పూర్ణచంద్రరావు

దర్శకత్వం
తాతినేని రామారావు

సంగీతం. చక్రవర్తి   కెమెరా: డి.డి. ప్రసాద్

వి.యం.సి

జ్యోతి



ఉలిక్కి పడ్డాడు అతను. తల తిప్పి వెనక్కి చూసాడు. తనలాంటి డ్రస్సే వేసుకున్న ఓ యాభై ఏళ్ళ మనిషి నవ్వుతూ నిలబడ్డాడు.

మౌనంగా లైటర్ అందించాడు.

పరబ్రహ్మం సిగిరెట్ ముట్టించుకుని ఆకాశం పైపు పరిశీలనగా చూసాడు. సంధ్యా సమయపు కాంతిలో మేఘాలు వింతరంగుల్లో మెరుస్తున్నాయి.

"ఆకాశాన్ని చూస్తుంటే అందమైన పెయింటింగ్‌లా ఉంది సృష్టికి మించిన చిత్రకారుడు ఎక్కడా లేడనుకుంటాను" అన్నాడు పరబ్రహ్మం సాలోచనగా.

అతనుకూడా ఆకాశంవైపు చూసి నవ్వాడు.

"మీరు పెయింటరా" అతడు పరబ్రహ్మాన్ని అడిగాడు.

"కాను కళారాధకుణ్ణి ఈ అందాన్ని గీతల్లో రంగుల్లో కాగితంమీద ఉంచలేకపోయినా కనీసం మాటల్లో కాగితంమీద పెట్టాలన్నది నా తాపత్రయం ఆవేశం ఉందికాని అది మాటల్లో బయటికి రావటం లేదు"

"అదే కళాకారుడికి మామూలు వ్యక్తికి గల తేడా" అతను గర్వంగా అన్నాడు.

"ఈ ఆకాశాన్ని చూస్తోంటే మొన్న ఓ పత్రికలో పడ్డ కథలోని వర్ణన గుర్తొస్తోంది దాని పేరు 'శృతిలయ' అన్నట్టు మీరు పత్రికలు చదువుతారా" అడిగాడు పరబ్రహ్మం. ఆ మాటవినగానే ఆ అబ్బాయి మొఖం విప్పారింది "మీరు చదివారా" అడిగాడతను.

"ఒకసారేమిటి నాలుగుసార్లు చదివాను అద్భుతమైన కథ అది. ఫెంటాస్టిక్. ఎవరో ప్రకాష్‌ట. గిఫ్టెడ్ రైటర్. ఎడిటర్‌కి రాసి అడ్రస్ తీసుకుని అతన్ని కలుసుకుందామనుకున్నాను కాని పనిలోపడి మరచిపోయాను" సిగరెట్ పొగ వదుల్తూ అన్నాడు పరబ్రహ్మం.

"నేనే ప్రకాష్‌ని" అప్రయత్నంగా అన్నాడతను ఒక అపరిచిత వ్యక్తి తనని అంతగా పొగుడుతూంటే ఆనందాన్ని పట్టలేకపోయాడు, తన పేరు ప్రకటించి ఆ ప్రశంశల్ని అందుకోవాలన్న ఆతృత అతన్ని దొలిచేస్తోంది పరబ్రహ్మం అమాంతం అతన్ని కౌగిలించుకున్నంత పనిచేశాడు.



"ప్రకాష్ అంటే నువ్వా. అలాంటి కథ రాసిన తను ఇంత కుర్రాడంటే నేను నమ్మలేకపోతున్నాను నేను ఇంకా ఎంతో పెద్ద వ్యక్తిని ఊహించుకున్నాను, యు ఆర్ గ్రేట్" పరబ్రహ్మం ప్రకాష్‌ని ఊపేసాడు.

"నాదేముందండి. నాకన్నా బాగా రాసేవాళ్లు ఎందరో ఉన్నారు" మొహమాటంగా అన్నాడు ప్రకాష్. అతని కుడుపుకి ఉక్కిరి బిక్కిరయిపోతున్నాడు. అయినా అతని అభిమానాన్ని తలుచుకుని ఏమీ అనలేకపోతున్నాడు.

కాసేపు అలా ఊపిన తర్వాత అతన్ని వదిలిపెట్టాడు పరబ్రహ్మం.

"అలా అనకోయి. తోటలో అనేక పూవులుంటాయి. దేని అందం దానిదే. దేని పరిమళం దానిదే. అయితే ఒక్కొక్కరికి ఒకో పువ్వు నచ్చుతుంది అభిమానం అంటే అదే."

"అహా. ఏం చెప్పారు సార్. ఇందాక భావాన్ని కాగితంమీద పెట్టలేకపోతున్నానని బాధపడ్డారు. కాని ఇంతలోనే ఇంత అద్భుతమైన భావాన్ని చెప్పారు. మీరు నాకన్న గొప్పవారు సార్. మీ అభిమానానికి కృతజ్ఞతలు." ప్రకాష్ తబ్బిబ్బై పోయాడు. పరబ్రహ్మానికి కావలసింది అదే.

"నా అభిమానమేముందోయి. ఆనందరావని నా స్నేహితుడున్నాడు. నువ్వంటే విపరీతమైన అభిమానం. నువ్వు రాసింది ప్రతిదీ చదువుతాడు. నీ నవలల్లో పాత్రలు, డైలాగులు కంఠోపాఠంగా చెప్పగలడు, నీ ప్రతిభను గుర్తు

ష్టి మొట్టమొదటిసారి నాకు చెప్పింది అతనే"

అనంతరావుమీద ఇంప్రెషన్ కలిగించడానికి దొరికిన అవకాశాన్ని జాగ్రత్తగా ఉపయోగించుకున్నాడు పరబ్రహ్మం. ప్రకాష్ ముఖంలో అప్పుడు వెలిగిన వెలుగుచూసి తృప్తి పడ్డాడు.

"ఎవరుసార్ ఆయన, ఆయన్నోసారి కలుసుకోవాలనుంది" తన కూడా అభిమానులున్నారన్న భావన రాగానే నిలవలేక పోతున్నాడు ప్రకాష్.

"అతను ప్రస్తుతం ఇక్కడే ఉన్నాడు, నువ్వు ఇక్కడున్నావని తెలిస్తే పొంగిపోతాడు. పరుగున వచ్చి కలుసుకుంటాడు."

"వెల్‌కం సార్. తప్పకుండా రమ్మనండి. మా ఇల్లు చూపిస్తాను. మీరు ఆయన్ని తీసుకురండి. ఇంటికి రావడానికి కుదరకపోతే ఆఫీసుకి రండి. అడ్రస్ ఇస్తాను." ఇద్దరూ ఆ గుట్ట దిగారు. ఇల్లు చేరుకున్నారు.

"ఇదే సార్ నేను ఉండే ఇల్లు రండి" ప్రకాష్ లోపలికి దారితీసాడు.

"ఇల్లు చాలా బాగుందోయి" అన్నాడు పరబ్రహ్మం.

"ప్రకాష్ ఆయనవంక చూసి ఈ ఇల్లు మా మామయ్యది" అన్నాడు.

"అలాగా"

ఇద్దరూ లోపలికి దారితీసారు.

"అన్నట్టు నేను నిన్ను "ఏమోయి" అని ఏక వచనంతో సంబోధిస్తున్నాను. ఏమీ అనుకోవు కదా! ఏదో అభిమానం పొంగుకొచ్చి అలా అన్నాను కాని అమర్యాదగా..."

"అదేమిటి సార్ మీకంటే నేను కుర్రాణ్ణి. మీరు చొరవ తీసుకుని అలా అనడం నాకు ఎంతో సంతోషంగావుంది, మీరు అలా పిలవకపోతే నేనే అడిగి పిలిపించుకునే వాడిని" ప్రకాష్ పూర్తిగా పోల్తా పడ్డాడు.

"ఆహా ఇంత టాలెంట్ ఉన్న నువ్వు చూపిస్తున్న వినయం ముచ్చటగా ఉందోయి"

పరబ్రహ్మం గది గోడల్ని చూస్తూ స్థాణువులా ఉండిపోయాడు. కుర్చీలోంచి దిగ్గునలేచి గోడల్ని చూస్తూ నడవసాగాడు. ఏదో పూనినట్టు నడుస్తున్న అతన్ని చూసి కంగారుపడ్డాడు ప్రకాష్.

"ఏమిటి సార్" అన్నాడు అప్రయత్నంగా




పరబ్రహ్మం వినిపించుకోలేదు నాలుగడుగులువేసి వ్రేలాడుతున్న పెయింటింగ్ ఎదురుగా నిలబడిపోయాడు.

"ఏమోయి ఎక్కడయినా అంతర్జాతీయ మ్యూజియంలోంచి పట్టుకొచ్చారా ఈ పెయింటింగ్‌ని" దానివేపే చూస్తూ అడిగాడు.

"లేదు సార్. అది పెయింట్ చేసింది నేనే"

"నువ్వా" ఆశ్చర్యపోయాడు పరబ్రహ్మం. పరుగున వచ్చి అమాంతం కౌగిలించుకుని "ఆహా పికాసో, రవి వర్మల్లాంటి ఆర్టిస్టుని చూసానయ్యా ఈ రోజు. ఈరోజు సుదినం" అన్నాడు. కాసేపు ఆగి "ఇందాకే నీ 'శృతిలయ' కథలో వర్ణన చూసినప్పుడే ఈ రచయిత పెయింటరేమోనని అనుమానం వచ్చింది. నేను కరెక్ట్" ప్రకాష్‌ని పొగడ్డంతోపాటు తనని తాను పొగుడుకున్నాడు.

ప్రకాష్ పూర్తిగా బోల్తా పడ్డాడని రూఢి చేసుకున్నాక

"ఇక నేను వెడతానోయి. ఆనందరావుని తీసుకు వస్తాను. వాడు ఇవన్నీ చూసాడంటే ఎగిరి గంతేస్తాడు" అన్నాడు.

"కూర్చోండి సార్" అన్నాడు ప్రకాష్.

ఆ ఇంట్లో మిగిలిన శాల్తీల మాటేమిటి? వాళ్ళని కూడా చూసేస్తే పూర్తి కథ తెలుస్తుంది పరబ్రహ్మం ఓ క్షణం ఆలోచించాడు.

"తాగని మంచినీళ్ళు తెప్పించవోయి" అన్నాడు.

"సారీ సార్ మర్చిపోయాను" అని లోపలికి వెళ్ళి, రెండు గ్లాసులతో మంచినీళ్ళు, రెండు కప్పుల కాఫీ పట్టుకొచ్చాడు

"ఇంట్లో వాళ్లు బయటకు వెళ్ళారు. ఎవరూ లేరు అందుకే స్వయం సేవ" అన్నాడు ప్రకాష్.

"ఈ ఇంట్లో ఎవరెవరుంటున్నారోయి"

"మామయ్య, అత్త. వాళ్ళ అమ్మాయి, నేను"

"వాళ్ళమ్మాయి అంటున్నావు. ఇంకా పెళ్ళి కాలేదా" అడిగాడు పరబ్రహ్మం ఆ ప్రశ్నకు సమాధానం తన ముందు కార్యక్రమాన్ని నిర్ణయిస్తుంది

"లేదండి" సిగ్గుపడుతూ అన్నాడు ప్రకాష్

"ఇంకా అవకపోతే ఏంలే ఎలాగూ అయ్యేదేగా. బంగారంలాంటి కుర్రాడు ఇంట్లో ఉంటే మీ మామయ్య వదులుకుంటాడా. సరే ఈసారి ఆనంద రావుతో వచ్చినప్పుడు నీ కాబోయే శ్రీమతిని చూస్తాను" అన్నాడు నవ్వుతూ పరబ్రహ్మం. అలా అని ప్రకాష్ ముఖంలోకి దీక్షగా చూసాడు. దీంతో తెలుస్తుంది ప్రకాశ్ ముఖంలో ఇబ్బంది కనిపించింది పరబ్రహ్మం మనసు సంతోష పడింది.

"అబ్బె అదేం లేదండి" ప్రకాష్ చెప్పడానికి మొహమాట పడుతున్నాడు అంటే ఈ సంగతి పూర్తిగా నిశ్చయం కాలేదన్నమాట పరబ్రహ్మం సందేహం వదలిపోయింది కుదురుగా కూర్చున్నాడు.

"నీ రచనలు నేను పూర్తిగా చదవలేదోయి నేను ఫూర్ రీడర్ని నేను ఇంకా నాలుగు రోజులు ఇక్కడే ఉంటాను నీ పుస్తకాలు ఇస్తావా చదివిస్తాను"

"ఓ యస్, చాలా సంతోషం సార్" ప్రకాష్ గదిలోంచి నాలుగు పుస్త కొచ్చి పరబ్రహ్మానికిచ్చాడు

"వస్తా నాయన గుడ్‌నైట్" పరబ్రహ్మం బయలుదేరాడు




"ఉండండి మెయిన్ రోడ్ మీద ఆటో దొరికేవరకు డ్రాప్ చేస్తాను" స్కూటర్ తీసి పరబ్రహ్మాన్ని ఎక్కించుకుని బయలుదేరాడు.



"సామజ వరగమనా" పాడుకుంటూ లోపలికి వచ్చాడు పరబ్రహ్మం.

"కర్ణకఠోరంగా ఉంది నీ పాట ఆపు" అన్నాడు ఆనందరావు ఫైల్లోంచి తల ఎత్తకుండనే. పరబ్రహ్మం ఎదురుగా సోఫాలో కూర్చున్నాడు.

"ఆ ఫైల్స్ పక్కకినెట్టి నువ్వు ఈ నాలుగు పుస్తకాలు ధరోగా చదవాలి"

"ఏమిటవి"

"నీ అభిమాన ఆరాధ్య రచయిత రాసిన నవలలు"

"నా అభిమాన రచయితా! ఎవడు వాడు ఈ ప్రపంచంలో రచయిత అంత పనికిమాలిన వాళ్ళు లేరని నా అభిప్రాయం నిత్యం కలలు కంటూ అవాకులు చెవాకులు రాసి కాగితాలు కరాబుచేసే ఆజాతి అంటే నాకుమంట. అయాం ఎ ప్రాక్టికల్ మాన్. ఐ లైక్ ప్రాక్టికల్ పీపుల్. ఈ చెత్తంతా చదివేందుకు నాకు టైం లేదు. నువ్వే చదువు"

"నాకు దీంతో పనిలేదు. నేనప్పుడే నా అభిమాన రచయితని కలుసుకుని బోల్తాకొట్టిం చేశాను. ఇప్పుడు నాకన్నా వెర్రి అభిమానివైన నువ్వు అతన్ని కలు

సుకొని బుట్టలో వేసుకోవాలి. అదే ఈ ప్రొఫెసర్ అఫ్ ప్రేమిస్ట్రీ పథకం"

"చంపావ్ ఈ రచయిత ఎవరు ప్రకాషా?"

"అవును కొరకురాని కొయ్యని మెత్తబరిచాను. ఇప్పుడు ఆ కుర్రాడు నిన్నుకలుసుకోవానికి తెగ కుతూహలపడుతున్నాడు. గబగబా నువ్వీ నవలలు చదివి వీటిని గురించి చర్చించావంటే అతను నీ వలలో పడిపోతాడు"

"మై గుడ్ నెస్ పనిష్మెంట్ నాకా ఒరేయి నాకు నవలలంటే అందులోనూ తెలుగు నవలలంటే పరమ చికాకు"

"ఏం చేస్తాం చదవాల్సిందే తప్పదు స్వప్న కోసం ఏదేనా చేస్తానన్నావు ఈ మాత్రం చెయ్యలేవా"

"డీ ఇలా పడెయ్" అన్నాదు ఆనందరావు.

బేరర్ని పిలిచి "ప్లాస్క్ లింకా టీ పట్రా" అని ఆర్డరువేశాడు. నవల ముఖ చిత్రం చూశాడు పేరు- 'తొందర పడ్డకోయిల', "అన్నట్టు తొందరపాటంటే గుర్తుకొచ్చింది. ఆ ఇంట్లో ఉన్న మేనమామ ఆయనకున్న ఇరవైఏళ్ళ కూతురు ఆ సంగతేమో కనుక్కున్నావా, తీరా అతనికి సంబంధం నిర్ణయమైపోతే మనకి శ్రమ దండగ"

"అవన్నీ చూడకుండా నీకు పని పెడతానా. పెళ్ళి ఇంకా నిశ్చయం కాలేదు ఆ అమ్మాయిని చేసుకోవాలని అతనికీ అంత ధృడంగా వున్నట్టు కూడా లేదు కాబట్టి మనం అయస్కాంతంపెట్టి లాగామంటే మన వైపుకి వచ్చేస్తాడు"

ఆనందరావు ఈలవేసి పిల్చుకున్నాడు.

"ఏమో నీతో వ్యవహారం నేల విడిచిన సాము లాంటిది. నేను ఈ పని ముగించుకొని త్వరగా వెళ్ళి పోవాలి. ఈ రాత్రంతా వీటిని చదివి బుర్రలోకెక్కించుకోవాలి కాబోలు హాత విధి" అంటూ ఆ పుస్తకాలు పట్టుకూచ్చున్నాడు పరబ్రహ్మం బట్టలు మార్చుకుని మంచం ఎక్కాడు. అరక్షణంలో గుర్రుమంటూ గురక పెట్టసాగాడు. అతనికేసి అసూయగా చూశాడు ఆనందరావు.

ఆనందరావు గారని స్వప్నా కాస్మెటిక్స్ చైర్మన్ గారు మీ కోసం వచ్చారు"

(సశేషం)

Edited & Published by V. Leelavathy Raghavaiah, at 1-8-519/11, Chikkadpally, Hyd-20 & Printed by P. Ramakrishna at Raghava Printers, 1-8-4/1/1, Chikkadpalli, Hyderabad-502

